స్థాలిర చందా రు 1-0-0 (పోస్టేజితోసహా) Reg. No. M. 3766

సంపుటము 31 సంచిక 5

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

ఆగష్టు 1942

సంపాదకులు:

శ్రీయుత మహోవాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రొప్రయిటరు:

రామా అండ్ కో.,

హెడ్ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్ :— మద్రాసు - గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr. Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# విషయసూచిక

ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 31 | ఏలూరు 15 ఆగష్టు 1942 | సంచిక 5 |
|---|---|---|

# నిత్యసంకీర్తనము

**వివరణము :**

మానవుఁడు విజ్ఞానియైనపుడు తానుభగవంతుని యంశమేయని గ్రహించును. అపుడు సర్వములో నాతఁడుండును. జనులు శివమును, సత్యమును, సుందరమును, అగు వస్తువును గాంచుదురు. కాని వారు ద్వారముల బిగించుకొనుచో నష్టపడుదురు. ప్రతి వారికి శాశ్వతసౌఖ్యము, శాంతి, యావశ్యకములే! కాని శాశ్వతవస్తువు క్షణములో లభింపఁజాలదుగదా? అదియెచ్చటనుండి వచ్చునో దానిమూలమును మొదట కనిపెట్ట వలెను, అదియే జ్ఞానము.

**సంకీర్తనము :**

1. హేప్రభూ! సర్వాంతర్యామివగు నీదివ్య చైతన్యము నాయంతరంగ భావముల నెఱింగి నిన్ను సందర్శింపఁగలశక్తి నాకొసంగునుగాక!
2. హేదీనదయాళూ! సదా నిన్నే యుపాసింపఁగల మహోన్నత భావములను, స్వార్థరాహిత్యమును, నీవు నాకనుగ్రహింతువు గాక!

—స్వామిరామతీర్థ

# బాల నీతి

రచయిత:—చిలకా వేంకట కృష్ణదాసు.

తే॥ గీ॥ ఎట్టి కార్యంబునం దైన పట్టుదలను
విడువకయె సేయ సిద్ధించు విజయలక్ష్మి
పట్టుదలచే విమానమున్ మాంటుగోల్ఫి
యరులు కనిపెట్టగల్గిరి యవని బాల !

తే॥ గీ॥ తప్పుఁజేసి దాని గప్పిపుచ్చంగను
బొంకులాడ నదియు ముందుతప్పు
తోఁడగలసి రెండుదోషము లౌగాదె
యట్టిపనులఁ జేయ కవని బాల !

తే. గీ. ఇంద్రుఁడవు నీవు చంద్రుఁడ వీవటంచుఁ
బొగడినంతనె యుబ్బక ముందువలెనె
పరుల కుపకృతి సల్పు మపకృతి సలుపఁ
బూన కెపుడు విరోధుల కేని బాల !

తే. గీ. బండరాతిని గిరిపైకిఁ బంప కష్ట
మచటనుండి క్రిందికిఁ ద్రోయ నాతికష్ట
మటులె సద్దుర్యశంబుల నార్జనమున
తారతమ్యము కన్పడు ధరణి బాల !

తే॥ గీ॥ చుట్ట సిగరెట్టు బీడీల ముట్టినయెడ
వాటియందున్న విషము నీ శ్వాసకోశ
హృదయముల పాడుఁజేయును మెదడు జెఱచుఁ
గాన వాటిఁ గాల్పకు మెప్పుడైన బాల !

తే॥ గీ॥ ఆటపాటల మజ్జనాహారతతుల
మైత్రియందున మన మాడు మాటలందు
మితమె యెంతయు హితమగు మితినిమీఱ
హాని తప్పక వాటిల్లు ననఘ బాల !

తే॥ గీ॥ సత్యమే భువి సకలార్థ సాధనమని
యాత్మలో నెంచి వర్తింపు మనుదినంబు
సత్యవర్తనుఁడౌ హరిశ్చంద్రవిభుఁడు
భాగ్యభోగంబుల మఱల పడసె బాల !

తే॥ గీ॥ వసుధ "నారోగ్యమే మహాభాగ్య" మనెడి
నుడి నెరింగి యారోగ్యముఁ బడయఁ గోరి
యనుదినంబును వ్యాయామమును సలిపిన
సౌఖ్యజీవివై యుందువు సతము బాల !

---

# ఉపాధ్యాయుని బ్రతుకు

వేదుల సూర్యనారాయణశాస్త్రి

ప్రపంచమందు "బ్రదుకు తెరువులేక బడిపంతులు" అన్నసామెత సార్థకమైనదియే, అయినను ఇట్టి ఉత్కృష్టజీవనము మరెందును గానరాదు. మహారాజాధిరాజు మొదలు సేవకపర్యంతమందరు బాల్యమున ప్రప్రథమమున నీయుపాధ్యాయుని విద్యాబోధచేతనే తమతమ పూర్వజన్మ సుకృతపరిపాక విశేషంబున నేడు కలెక్టర్లు, విద్యాధికార్లు, యంత్రశాస్త్రజ్ఞులు, మాంత్రికులు, షడంగవేదవిదులు. ప్రధానమంత్రులు, రాజ్యాంగవేత్తలు, ఇదియదియననేల మరెన్నియో ఉద్యోగములు చేయుచు, దేశసేవ చేయుచు. ప్రభుసేవచేయుచు మహోత్కృష్ణ గౌరవమునందుచుండు టెల్లరకును విశదమగుచునే యున్నది. అట్లయ్యును ఆ మహాశయులందరు ఉపాధ్యాయుని నిరసనగాను, నీచముగాను, గౌరవహీనముగాను చూచుచుండు టెల్లరకును స్పష్టమే. ఇందుకు కారణములు కొన్నిగలవు. అవి అందరియందును గన్పడుటలేదు. స్కూలుమాష్టరన్నంతనే "ఓహో, ఇతడా, కూర్చుని ఏపెట్టుబడీలేదు; పన్నులేదు; ఊరక ఏమియు చదువుచెప్పక గుళ్లో లింగంలాగు, తాటిచెట్టుక్రింద గొంతెమ్మలాగు, మట్టి ద్రోణాచార్యులవారిరీతి, ఉంగ్రాణ్ణుతినే వినాయకుని భంగి, అప్పనముగా జీతము రు 20, 25 లు పుచ్చుకొనుటయే యీతనివృత్తి" యని భావించుచున్నారు. ఆహా ఎట్టి దుష్కాలము ! కలిప్రభావము ! ధర్మము నశించెనా ? భగవంతుడు సర్వసాక్షియై విశ్వమానవ కల్యాణము నొనరించుచు సర్వజనులను తనయొక్క కృపాకరుణావీక్షణములచే చూచుచు సర్వకాలములందు గాపాడుచుండ ప్రజలీవిధమున ఒక ఉపాధ్యాయుని, గురువును, తమ కోమలశిశుజ్ఞాన ప్రదాతను, నోరునొవ్వనాడుట సమంజసమా ! ఏ తండ్రియు తనకుమారు డేలబడికి వెళ్లలేదో, ఏల పాఠము చదువలేదో, ఏమిచేయుచున్నాడో, యేమియు కనుగొనడే !

బడికి ఎన్నిమార్లు ఆహ్వానము చేసినను, "ఏమండోయి ! యీవాళ మావాడు రాడు. కుప్పనూర్పు, లేక దమ్ములు, మంతలు పట్టుకెళ్లాలి, పిల్లనెత్తుకోవాలి; యిల్లు అలుక్కుంటున్నాము-వంట వండవలెను-దుకాణం అమ్మవలెను. చాకిరేవులోకిబట్టలు తీసుకువెళ్లవలెను - వెంకట్రామయ్యగారింట తలంటవలెను" ఇత్యాది సమాధానములు కొంతమంది చెప్పుచున్నారు. ఇక మరికొందరు, "మా పిల్లలు రాకపోతేనేమి వస్తేనేమి ? మీజీతంముడుపు ముట్టుతుందిగదా ? మీకేమి" అనియు, "ఏమోయి వెంకటస్వామీ - పిల్లలను పిలవక తీసుక వెళ్లకపోతే వీళ్లకు మేష్టరీ తీసేస్తారోయి-అంచేత యీలా ఏడుస్తారు" అని కేళాకోళము చేయుచు కొందరు యీలాగు చూచుచున్నారు - యింక చదువులెట్లు వచ్చును ?

కేవలము చదువు గావలెనన్న ముఖ్యమగు మార్గములు కలవు బాలురను ప్రేమతోను, ఆసక్తితోను, ఉపాధ్యాయులు ఉచితమగు బోధనాపద్ధతులతో చక్కగ నిరంతరము, వారివారికి పాఠములు చెప్పుట వారిండ్లకుబోయినపుడు వారి సంరక్షకులు "ఒరే ! నీకు నేడు మీపంతులుగారేమేమి పాఠములు చెప్పినారు ? వాటిని నీవు చదివి వినిపింపుము-అని యింటివద్ద ఆబాలుర చేత చదివించుటగూడ మంచిపనియే యగును. అట్లాచరించిన మంచికలుగును. అంతేగాక ఊరక వీరు జీతములు పుచ్చుకొంటున్నారని ఎందుకు మాటిమాటికి అనడం - వీరు మాత్రం పొలములు కొనుక్కొనుటలేదా ? వ్యవసాయం చేయుచుండుట

లేదా ప్రజలను అనేకరీతుల దగాచేయుట లేదా? అక్రమ ప్రవర్తనలు గావించుట లేదా? నిజముగా ఉపాధ్యాయుడీ విషయములలో నేదియయిన చేయుచుండెనా? తనకు తెలిసినంత మట్టుకు బాలుర విద్యాభ్యాసమునకే తనకాలము, కాయము, శక్తి, వినియోగించుచుండెనే. ఇది సర్వులు గ్రహించి తోడి మానవులగు ఉపాధ్యాయుల దూషింపకుందురు గాక యని యీ పత్రికాముఖమున ప్రార్థించుచున్నారు.

న్యాయముగా అధికారులయొక్కయు, ప్రజలయొక్కయు భగవంతునియొక్కయు, పూర్ణాభిమానము ఉపాధ్యాయులమీద ప్రసరించి వీరు సుఖముగా, నిశ్చింతగా, హాయిగా, కాలక్షేపము చేయవలసియుండగా కలికాల మహాత్మ్యము వలననో, మరెందమూలముననో కాని పూర్వముండిన గురుశిష్యన్యాయము గురుజనాదరణము నశించినవి విద్యలు విక్రయపద్ధతి నవలంబము చేసిన యనంతరమే మనపూర్వులెరుంగని దుర్భరపరిస్థితులు మనల నెదుర్కొనుచున్నవి. ఉపాధ్యాయుడు కూడ మానవమాత్రుడే! సన్యాసిగాదు, సంసారియే. వీనికిగూడా భార్యా పుత్రాదులుగలరు, గౌరవముగా కాలక్షేపముల చేయవలసిన యుద్యోగి కాని 'పాకీపని వాడుగాడు. - పాకీవానికైన గౌరవము స్వేచ్ఛ, యున్నవికాని నేటి యుపాధ్యాయమున కేమాత్రమును లేవు. ఉపాధ్యాయుని కర్మమిట్లా అయిపోయినది. ఉపాధ్యాయుడు చేయునది విద్యాదానము. అన్ని దానములయందు నిరుపమానమైనది.

శ్లో॥ అన్నదానాత్పరం నాస్తి - విద్యాదానం తతోధికం
అన్నాత్సద్యోభవేత్తుష్టిః యావజ్జీవంతు విద్యయా
అన్నేనక్షణికాతృప్తి ర్యావజ్జీవంతు విద్యయా

లోకమునగల సమస్తదానములయందును అన్నదానము కడుంగడు శ్రేష్ఠమేయయ్యు విద్యాదానము మరింతయధికము అన్నముచే తాత్కాలిక తుష్టియును, విద్యచే యావజ్జీవ తుష్టియు నగుచున్నది. అట్టివిద్యాదాన గురువు లోకులకు జ్ఞానప్రదాత. జనతాభావి నిర్మాణకర్త. సుఖయోగజీవనాధార మార్గప్రదర్శి, అండములోని పచ్చని ద్రవపదార్థము కరడుగట్టి యాకృతిగ నేర్పడి యాగ్రుడ్డుచీల్చిన పిదపలోన జరిగినకార్యము పిట్టయాకృతిగా బహిరతమగునట్లు ఉపాధ్యాయుడు బోధించిన బోధ, నేర్పిన నీతి, ఏర్పరచిన వర్తనము, కలిగించిన విధేయతాసంపత్తి నేర్పిన వాగ్విలాసము, ఎప్పటికప్పుడు తెలియబడక పెద్దవాడై లోకవ్యాపారమునకు దిగినప్పుడు విశదము కాగలదు.

ఉపాధ్యాయులును కష్టించి, శ్రమ, వ్యయ, ప్రయాసల కోర్చి విశేషముగా కృషి సల్పినంతనే, యథావిధిగా యథాక్రమముగా నిర్వర్తించుటచేతచే కవీశ్వరులు, పండితులు, ధీరులు, సమస్తశాస్త్రజ్ఞులు, యంత్రనిర్మాణకుశలులు, ఉపన్యాసకులు, పరీక్షకులు, దేశోద్ధారకులు, దేశసేవకులు, సంఘసేవకులు, న్యాయాధిపతులు, న్యాయవాదులు, లేఖకులు, వాణిజ్య విద్యావిశారదులు, కృషికులు, గాయకులు, చిత్రకారులు, శాసనసభాసభ్యులు, జమీందారులు, మంత్రులు మొదలగు వారలు బయల్పడి దేశనాగరికతయు, విద్యావ్యాసంగ లాభమును, ప్రకటింప సామర్థ్యముగలవారలై యీ విశ్వవిచిత్ర ప్రదర్శనాగారమందు ఉపాధ్యాయులనే ప్రదర్శింపబడిన జీవము గల చిత్తరువులగుచున్నారు. ఏతాదృశమగు-లోకోపకారమగు-పరమపవిత్రమగు నీయుపాధ్యాయవృత్తియందు ఆయుస్సు, తేజస్సు, తెలివితేటలు, అభినివేశము. విద్యాభిలాష, దేశాభిమానము, నేర్చిన విద్య, ఆరోగ్యము, వీనిని ఆమూలాగ్రము సదా వినియోగించుచుండే ప్రాథమికోపాధ్యాయుల ఋణము దీర్ప ఎన్ని జన్మములకైన నెరికయినా తరమా? అట్టితటి నీ యుపాధ్యాయులందఱిచేతను సామాన్య దృష్టితో కొన్ని యెడల నీచముగా చూడచుండిరేగాని సగౌరవముగా చూడబడుట లేదు. కావున సూమహాశయులారా! యాథార్థ్యమును గుర్తించి, మీ మీ మనస్సులయందున్న నీచభావములను విడనాడి మీతోడి మానవులగు నీ బీద ప్రాథమికోపాధ్యాయులను గూడ సగౌరవముగా చూడుడు. ఆదరింపుడు-ఇందువలన మీ గౌరవాధికారముల కేమాత్రము కొఱంతయు సంభవింపదు.

---

# బాలనాటికలు

## ౨. నేత్రవైద్యుడు - రావమ్మ

జి. కె. చౌదరి

(నాలుగురంగాల నాటిక)

పాత్రలు :

నేత్ర వైద్యుడు :
రావమ్మ : [యాభై యేళ్ళ ముసలిది. కళ్ళ జబ్బుతో బాధపడుతున్నది.]
జడ్జీ :

### మొదటి రంగము

(డాక్టరుగారి గది - కళ్ళజబ్బుతో బాధపడుతూ అరుచుకుంటూ - బాధననుభవిస్తూ- చేతికఱ్ఱను ఆన్చుకుంటు రావమ్మ ప్రవేశము)

రా:—బాబూ! డాక్టరుగా రెక్కడ?

డా:—ఎందుకు?

రా:—నాకళ్లు జబ్బు; చూపించుకుందామని.

డా:—ఏం జబ్బు?

రా:—మూడుమసాల క్రితం కళ్లు మంటలూ, దురదలూ, చూపుకూడా కాస్తమసక మసక అనిపించింది. అప్పటినుండి యిప్పటికి వెయ్యానిమందు లేదు. నువ్వా-నువ్వా చెప్పిన అన్నిమందులూ వేశాను. ఆనాటి కానాటికి బాధా ఎక్కువైంది, మసకా మూపయింది. తమవల్ల అవుతుందేమోనని వచ్చాను.

డా:—(కళ్ళను పరీక్షించి) ఈ కూరగాయవైద్యాలు చెయ్యకుండా, మొదట్లోనేవస్తే ఇంత వాధలేకుండా చక్కగా నయమయ్యేది. ఇప్పుడైనా పరవాలేదు. ఒక నెలపాటు రోజూ మందు వేయించుకోవాలి.

రా:—చిత్తం బాబూ!

డా:—మరి ఆలస్యంచేస్తే లాభంలేదు. ఆనాటి కానాడు బాధ యెక్కువౌతుంది; చూపుకూడా పోతుంది.

రా:—చిత్తం! నేను వంటరిదాన్ని మరిరెండో తోడులేని దాన్ని.

డా:—ఐతే—

రా:—ఈ ముసలిదానియందు దయయుంచి తమరే రోజూ మాయింటికివచ్చి మందు వేస్తూవుండండి. మీ కష్టం వుంచుకోను.

డా:—నీకళ్ళు చక్కగా నయంచేస్తాను, మొత్తం పాతికరూపాయ లివ్వాలి.

రా:—బాబూ! నా కళ్లు చక్కగా నయమైతే పాతికకాదు. యాభై రూపాయ లిస్తాను.

డా:—సరే! రోజూవచ్చి మందువేస్తూ వుంటాను.

రా:—చిత్తం! వస్తాను బాబూ!

డా:—మంచిది.

(రావమ్మ నిష్క్రమించును.)

## రెండవ రంగము

(జడ్జీకోర్టు-వాది డాక్టరు: ప్రతివాది రావమ్మ; ప్రవేశం. జడ్జీ ప్రతివాది రావమ్మ నుద్దేశించి ప్రశ్నిస్తాడు.)

జ:—ఏవమ్మా! ఈ డాక్టరుగారివల్ల కళ్లు నయంచేయించుకొని, ఇస్తానన్న రూపాయ లియ్యలేదట; దీనికేం చెప్తావు?

రా:—అయ్యా! నాకళ్లు నయమైతే యిస్తానన్నమాట వాస్తవమే.

జ:—నయము కాలేదామరి?

రా:—లేదుబాబూ! లేదు. నాకళ్లకు ఈ డాక్టరుగారు మందు మొదలుపెట్టకమునుపు నాయింటినిండా కుర్చీలు, మంచాలు, పరుపులు, ఇత్తడి-వెండిపాత్రలు, అన్నీ కనబడేవి.

జ:—ఇప్పుడో?

రా:—డాక్టరుగారు రోజూవచ్చి నాకళ్లల్లో మందువేసి కట్టుకట్టి వెళ్తూవుండేవారు. చివరకు నయమయినాయని కట్టువిప్పారు. చూస్తినిగదా నాయింట్లో కనబడ వలసిన సామానులలో వక్కటీ కనబడలేదు. అటువంటప్పుడు నాకళ్లు నయ మయినాయని చెప్పడమెట్లా బాబూ!

జ:—(డాక్టరుచేసిన మోసమును తెలుసుకొని) డాక్టరుగారూ! మీలాంటి చదువు కున్నవారుకూడ ఇటువంటి నీచపుపనికి పూనుకుంటే - కంచెయేచేనుమేసినట్లవు తుంది. కనుక మీరు వెంటనే వెళ్లి రావమ్మ సామాన్లు ఏమేమి తెచ్చుకొన్నారో వాటినన్నిటినీ పంపించి వెయ్యండి. మీరు చేసిన తప్పుకు కోర్టువారికీ - రావ మ్మకూ-క్షమాపణచెప్పుకోవాలి! లేకుంటే నేరస్థులు మీరవుతారు.

డా:—(గజగజ వణకుతూ, తడబడుతూన్న స్వరంతో) అయ్యా! ఇటువంటిపని మరెప్పుడూ చెయ్యను, (రావమ్మకేసిచూస్తూ) అమ్మా! మీసామానుల నన్నిటినీ యిప్పుడే బండిమీద పంపుతాను—

జ:—రావమ్మా! నీవు వెళ్లి ఆయాసామానులేవో జాగ్రత్తగా చూచుకో.

రా:—చిత్తం బాబూ!

(రావమ్మ, డాక్టరూ నిష్క్రమింతురు)

---

# ౩. కొంటి కోణంగి

జి. కె. చౌదరి

పా త్ర లు:

సుందరం:—(ఏడేళ్లు నాలుగోతరగతి లలితఅన్న)
లలిత:—(పదేళ్లు రెండోతరగతి సుందరం చెల్లెలు.)
కామేశ్వరరావు:—తండ్రి

*　　　*　　　*

(ఒకనాడు 10 గంటలకు సుందరం-లలిత బడినుండి వచ్చారు. "నాన్న పేటనుండి లడ్డూలు తెచ్చారు" అని సుందరానికి రెండిచ్చి, ఒకటి లలితకుకూడా ఇమ్మంది వాళ్లమ్మ)

సుందరం:—(గబగబావచ్చి) లలితా !
లలిత:—ఆ !
సుం:—ఎక్కడ ?
ల:—చదువుకుండే గదిలో !
సుం:—(అక్కడికివెళ్లి) ఇవిగో ! అమ్మ మూడులడ్డూలు యిచ్చింది. (అని చూపును.)
ల:—(దగ్గరకొచ్చి చూచి) ఏవీ ? రెండేగా !
సుం:—కాదు. ఇవిగో ! మూడు.
ల:—ఆ ! రెండేగా అన్నా !
సుం:—సరిగా చూడు. (అని రెండు చూపెట్టును).
ల:—(చేతిలో వున్న వాటిని పరిశీలించి) రెండేగా !
సుం:—(కసురుతూ) మూడని చెప్పుతుంటే రెండంటావేం !
ల:—ఏవి చూపించు ?
సుం:—ఇవిగో !
ల:—ఒకటి, రెండు. రెండేగా వున్నవి. (ముఖంకేసి చూస్తూ) లెక్కపెట్టు చూద్దాం.
సుం:—నే లెక్కపెడతా చూడు. ఒకటి, రెండు- రెండూ- (+) ఒకటి మూడు.
ల:—అట్లా ఎందుకైయింది లెక్కపెట్టేది ? ఒకటి, రెండు.
సుం:—అట్లాకాదు - నీకేంతెలుసు ? నేను లెక్కపెట్టిందే రైటు. ఇవిమూడు (ఈ విధంగా లలితను విసిగిస్తూన్న సుందరం మాటలు విని తండ్రి కామేశ్వరరావు ప్రక్కగదిలోనుండి వచ్చి)
కా:—ఏమిటమ్మా ! మీ తగాదా ?
ల:—ఏమీలేదునాన్నా ! అన్న రెండులడ్డూలుతెచ్చి మూడుఅంటున్నాడు.
కా:—ఏంరా ! సుందరం ?
సుం:—ఔను నాన్నా ? ఔను అమ్మ మూడులడ్డూలు యిచ్చింది. ఇవేం !
:—ఐతే మళ్ళీ లెక్కపెట్టు.

సుం:—ఒకటి, రెండు, రెండూ (+) ఒకటి మూడు.

ల:—ఇదేమిటి నాన్నా ? ఇట్లా లెక్కపెడతాడు అన్న ? రెండేగావుంది.

కా:—(సుందరం చమత్కారానికి లోనసంతోషిస్తూ) ఎన్నిరా అవి ?

సుం:—మూడు నాన్నా ! మూడు. ఇప్పుడు లెక్కపెట్టానుగా.

కా:—సరే. ఇవిమూడు గనుక ఒకటి చెల్లికి, ఒకటి నాకు యిచ్చి మూడోది నువ్వు తీసుకో.

సుం:—ఆ ! పాపం ! (అంటూ లలితచేతిలో ఒక లడ్డూపెట్టి రెండోది తాను తీసుకొని బజారులోనికి పరుగెత్తుకుపోతాడు.)

* * * * * *

---

# భూగోళము - ప్రశ్నోత్తరములు

## (ఆ ర వ త ర గ తి)

వేదాన్తము - శ్రీనివాసాచార్యులు

ఆఫ్రికాఖండపరిచయము-బార్బరీ రాజ్యములు-మధ్యధరాశీమలు-

1. అఫ్రికాఖండము యేగోళములోనిది ? దాని యెల్లలెవ్వి ?

జ: ఆఫ్రికాఖండము పూర్వార్ధగోళములోనిది. దీని యెల్లలు ఉత్తరమున మధ్యధరాసముద్రము. తూర్పున హిందూమహాసముద్రము. పడమర అట్లాంటిక్ మహాసముద్రము దక్షిణమునదక్షిణ మహాసముద్రమును గలవు.

2. ఆఫ్రికా ఖండమును చీకటి ఖండమని పిలుచుటకు కారణములెవ్వి ?

జ: ఈ ఖండమున కుత్తరమున ప్రపంచములోని యెడారులలో పెద్దదగు సహారా యెడారికలదు. దీనిని దాటుట దుర్లభము. ఈఖండ తీరరేఖ చీలియుండనందువలన నావయాత్ర కనుకూలముగ నుండకపోవుట-దట్టమైన అరణ్యములు-చిత్తడినేలలు క్రూర మృగములు-ఉండుటచే పరిశోధకులకు ఖండమును పరిశోధింప కష్టమాయెను. ఆంగ్లేయులచే చాలకాలమువరకు యీ ఖండము పరిశోధింపబడని కారణమున ఇది "చీకటి ఖండ" మని పిలువబడుచుండెడిది.

3. ఈఖండమందు వ్యాపించియున్న మూడు గొప్ప రేఖలెవ్వి.

జ: ప్రపంచములోకెల్ల యీ ఖండమందు మాత్రము వ్యాపించియున్న మూడు గొప్పరేఖలు భూమధ్యరేఖ-కర్కాటరేఖ-మకరరేఖ.

4. ఆఫ్రికాఖండమందు జనసంఖ్య తక్కువ - కారణములెవ్వి ?

జ: ఖండమధ్య భాగమందు గొప్ప అరణ్యములుకలవు. ఉత్తరమున సహారా ఎడారి, దక్షిణమున కలహారీ ఎడారులు కలవు. ఇట్టి ఎడారి ప్రదేశములు వాసయోగ్యములుకావు. పైరుపంటలు ఫలించవు. ఖండమందలి చాలభాగము ఉష్ణమండలములో నుండుట–ఈకారణములచే జనసంఖ్య తక్కువ.

(5) బార్బరీ రాజ్యములని పేరేలగల్గెను?

జ: బర్బరులను ఒకజాతివారు నివసించియుండుటచే యీ పేరు గల్గెను.

(6) బార్బరీ రాజ్యములనేవి ?

జ—మొరాకో - అల్జీరియా - ట్యూనిస్ - ట్రిపోలీ -

(7) మధ్యధరాశీతోష్ణస్థితి యననేమి ?

జ—వేసవికాలమందు బెట్టగనుండి శీతకాలమందు వర్షము కురియును - ఇట్టి శీతోష్ణస్థితికి మధ్యధరా శీతోష్ణస్థితియని పేరు.

(8) ఇచ్చట పండు పంటలెవ్వి?

జ—గోధుమలు - బార్లీ - పైరగును. మఱియు ద్రాక్ష, నారింజ, నిమ్మ అత్తిపండ్ల తోటలుండును.

(9) బార్బరీ రాజ్యములోని మైదానము – పీఠభూమి పేరేమి ?

జ—షెల్ అను మైదానము - షాట్సుపీఠభూమి.

(10) లిబియా - ఎవరిదేశము ?

జ—లిబియా లేక ట్రిపోలీ ఇటలీవారిది.

(11) ట్రిపోలీ ప్రాముఖ్యమేమి ?

జ—లిబియాకు ముఖ్యపట్టణము. ఎడారివర్తక కేంద్రస్థానము. రేవుపట్టణము. స్పాంజి వ్యాపారమునకు ప్రసిద్ధి.

(సశేషము)

---

# ఆంధ్రవాణి

కవిరాజ శ్రీ పట్టిసపు శ్రీరామమూర్తి కవి

ఉ. నన్నయ యుగ్గుపాలిడ ఘనమ్ముగ దిక్కన చంక నెక్కి పో
తన్న కవీంద్రునొద్ద సతతమ్మును సుద్దులనేర్చి రాయలన్
మన్ననజేసి ముచ్చటల మాన్యతనొందిన యాంధ్రవాణి ! ని
న్నెన్న దరమ్మె ? నీదుహాయి యెన్నిన యాంధ్రులు గర్వమందరే ?

---

# భాగవతము - పోతనకవి

కవిరాజ : శ్రీ పట్టిసపు శ్రీరామమూర్తి కవి

ఆ. వె. వ్యాసరచిత భాగ ♦ వతమును దెనిగింప
పోతరాజుసుకవి ♦ పుంగవునకె
చెల్లెగాని యితర ♦ చిల్లరకవులకు
జెల్లునొక్కొ ? వట్టి ♦ కల్లగాని.

---

# మౌన పఠనము

పి. సుదర్శనరావు - హెడ్మాష్టరు - ఒమ్మి.

## 1. సాధకము

[క్రింది వాక్యములను మౌనముగ చదువుకొని, జవాబులను పలకలమీఁద వ్రాయుము.]

1. నేనొక పతివ్రతను.
2. నాపేరు మూఁడక్షరములు గలది.
3. సాగరములో గలదు. సముద్రములో లేదు.
4. విమానములో గలదు. గాలి యోడలో లేదు.
5. త్రిలోకములో గలదు. ముల్లోకములో లేదు.
   నా పెరేమి ?

## 2. సాధకము

నేను సున్నలతో పదకొండక్షరములు గల విద్యాసేవకురాలను.

నాలో

6 వ అక్షరము "ప్రాయము"లో మొదటిది.
10+11 మానవులకు మూఁడవ నేత్రము.
7+8+9 పండ్లచెట్లలో నొకటి.
1+2+3+4+5+8 దీనికొఱకు కాందోళన జరుగుచున్నది.

నే నెవరు ?

## 3. సాధకము

[క్రింది వాక్యములను మౌనముగ చదువుము. వాక్యములోని సంగతి నిజమయినయెడల + అను గుర్తువేయుము; అబద్ధమయినయెడల — గుర్తువేయుము ]

1. జాలరి చేపలను పట్టును.
2. తీర్థములకు జనులు గుంపులుగా పోవుదురు.
3. యకరమునకు ఏఁబది చదరపు అడుగులు.

4. వారములలో మూఁడవది బుధవారము.
5. చంద్రుని కాంతి పగలు బాగుగ కనఁబడును.
6. కడవ అనగా కుర్చీ.
7. ముక్కుతో వాసనచూతుము.
8. లు ప్రథమావిభక్తి ప్రత్యయములలో నొకటి.

సూచన:— గుర్తులను పుస్తకములందు వేయగూడదు. పలకమీఁద 1, 2, 3, 4 అని యిట్లు అంకెలు వేసి, వానికి ఎదురుగ + లేక — గుర్తులను వేయవలయును.

4. సాధకము

(క్రింది వాక్యములను మానముగ చదువుకొని, జవాబులను పలకలమీఁద వ్రాయుము.)

1. వారు ఏలూరులో నొక ప్రొప్రయిటరు.
2. వారిపేరు సున్నతో ఏడక్షరములుగలది.
3. మొదటియక్షరము అ. ఆ. ల బడిలోనాలుగవది.
4. రెండవయక్షరము త. థ. ల బడిలో మూఁడవది.
5. మూఁడవ యక్షరము "దారము" లో రెండవది.
6. నాలుగవ యక్షరము "వెలుతురు" లో మొదటిది.
7. అయిదవ యక్షరము "గంప" లో మధ్యది.
8. ఏడవ యక్షరము "కొయ్య" లో కడపటిది.
9. ఆరవయక్షరము "రాక" లోను, "పోక". లోను కలదు. వారిపేరేమి?

5. సాధకము

[క్రింది వాక్యములను మానముగ చదువుకొని, జవాబులను పలకలమీఁద వ్రాయుము.]

1. నాపేరు నాలుగు అక్షరములు గలది.
2. నాజీలలోగలదు జర్మనులలోలేదు.
3. బడిలో గలదు పాఠశాలలోలేదు.
4. కాననములలో గలదు అరణ్యములోలేదు.
5. గయలో గలదు ప్రయాగలోలేదు. నాపేరేమి ?

## సాధకములకు జవాబులు.

1. సావిత్రి.
2. ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య
3. ప్రథమాక్షరములు "జాతీయవాచకములు."
4. ఈదర వెంకయ్య (గారు)
5. జీడికాయ.

---

# సృష్టి పరిశీలన - ప్రశ్నోత్తరములు

( ఐ ద వ త ర గ తి )



by

(ఏప్రిలుసంచిక తరువాయి)

తాతాజగన్నాధరావు. హెడ్మాష్టరు బోర్డుస్కూలు. కొంర్యాం.
వేదులఅన్నయ్యశాస్త్రి హెడ్మాష్టరు. బోర్డుస్కూలు. గురమ్మపాలెం.

10. అంటుత్రొక్కుట, అంటు కట్టుట యననేమి ?

జ:— గులాబి, మల్లె, ద్రాక్ష కొమ్మలను వంచి నేలమీద ఆనియుండునట్లు ఒకరాతినిగాని, మట్టిని గాని బరువు పెట్టుదురు. భూమిమీద ఆనినచోట ఒకటిరెండు నెలలలో కొమ్మనుండి వేళ్లు పుట్టును. వేళ్లు బాగుగా భూమిలో అల్లుకొనినపిమ్మట కొమ్మను చెట్టునుండి నరుకుపెట్టి, కొమ్మ వాడిపోకుండా చిగిర్చి బ్రతుకుచుండినపక్షమున కొమ్మను చెట్టునుండి నరికివేయుదురు. యీ పద్ధతికే అంటుత్రొక్కుట యనిపేరు.

మామిడి, సపోటా, నిమ్మ, దబ్బ, బత్తాయి మొదలగు వాటిని కుండ్లలో పెంచుదురు. మొక్క లావుగా పెరిగినపిమ్మట మంచిరకము కాయలు కాచెడి చెట్ల కొమ్మలతో అంట్లుకట్టుదురు. అంటుకట్టెడి మొక్కయు, కొమ్మయు ఒకటేలావుగానుండవలెను. పదునైన కత్తితో కొమ్మను, మొక్కను. రెండంగుళములమేర మధ్యవరకు చెక్కుదురు. రెండుబద్దలను చేర్చి ట్వైనుదారముతో దగ్గరగా అంటియుండునట్లు కట్టుదురు. కట్టుపైన మైనపుగుడ్డను చుట్టియుంచుదురు. నాలుగైదు మాసములలో మొక్క, కొమ్మకు ఆహారము నిచ్చును. చెట్టునుండి కొమ్మను కొంచెము కొంచెముగా నరుకుదురు. యీ పద్ధతికే అంటుకట్టుట యని పేరు. సపోటాచెట్లకు పాలమొక్కలను అంటుకట్టుదురు.

11. అంటు కట్టుటవలన గల లాభములేవి ?

జ:—అంటుకట్టినపక్షమున కొద్ది సంవత్సరములలో రుచికరమగు పెద్దకాయలు కాయును.

12. యింటితోటయం దేయే మొక్కలను నాటవలెను ?

జ:— ఇంటితోటయందు సాధ్యమగునంతవరకు దినచర్యయం దుపయోగించు మొక్కలుండవలెను. అరటిచెట్లు, పొట్ల, బీర, చిక్కుడు, కాకరపాదులు, వంగ, మిరపతోటలు, తోటకూర, గోంగూర, కొత్తిమిరి మొదలగునవి యుండవలెను. స్థలమున్నచో మంచి పుష్పజాతులు, మామిడి, పనస, సపోటా వృక్షము లుండవలెను.

Syllabus Heading.—Excursion to study local crops according to seasons.

1. విహారమననేమి ?

జ:—బడితోటలో వేయని మొక్కలను అక్కడకుగాని జంతుజాలములను, అవియుండెడిచోటికి పోయి వాని సహజస్వభావములను పరిశీలించుటకై సంచారమొనర్చుటకే విహారమనిపేరు.

2. విహారము లెన్నివిధములు ? అవియేవి ? ఏదిమంచిది ?

జ:—విహారములు రెండువిధములు. 1 సహేతుకమైనవి. 2 నిర్హేతుకమైనవి. సహేతుకమైనవి అనగా ఏదోయొక విషయమును పరిశీలించవలెనని ముందుగనే నిర్ణయించుకొని దానికొరకై సంచరించుట.

నిర్హేతుకమైనవి అనగా స్వేచ్ఛగాతిరుగుచు దారిలో కన్పించిన విషయములను పరిశీలించుట యందు ఉద్దేశ్యమేమియు నుండదు. సహేతుకమైన విహారములే మంచివి ఆటంకము లేకుండా చొరుచుకుని పోవుటకు వీలుగానుండును, చేపకంటికి రెప్పలులేవు. గాజు కన్నువలెనుండును. చేప నీటిలో ఎల్లప్పుడు నుండును. దానికి ఊపిరితిత్తులు లేవు. చేప తలవద్ద రంధ్రములున్నవి వీనికి మూతలున్నవి. మూతల నొత్తిగించి చూచినచో 5 పొరలు ఎఱ్ఱనివి యుండును. వీనికిమొప్పలని పేరు. చేప నీటిని మ్రింగి మొప్పలవద్దకు బంపును. నీటిలోని ప్రాణవాయువు, మొప్పలలోనికివచ్చిన రక్తమును శుభ్రపరచును.

2. పాములలోని రకములను చెప్పగలరా?

జ: మనదేశములందు త్రాచుపాములు, జెఱ్ఱిగొడ్లు, కొండచిలువలు పసరిక పాములు, కట్లపాములు, పొడపాములు, పరుగుడు పాములు, నీటికట్టెలు, బురదపాములు యను పలురకముల పాములు గలవు.

3. విషసర్పము లేవి? ఏఏలక్షణములను బట్టి వాటిని గుర్తించగలము?

జ: త్రాచు పాములు, పొడపాములు, కట్లపాములు మొదలగునవి విషసర్పములు విషసర్పములకు నిగనిగలాడు శరీరము, భయంకరమగు రంగును, మచ్చలునుండును త్రాచుపామునకు పడగయు, పడగపైని రెండు మచ్చలును ఉండును త్రాచుపాము కాటునకు రెండు గాయములు కలిగియుండుటయే ఆనవాలు.

Syllabus Heading —Seasonal changes in garden life.

1. వేసవికాలమున కృషీవలుని పనులను వివరింపుము?

జ: వేసవిలో రైతులు పొలములకు ఎరువులను వేయుదురు. ఆకుమళ్లను పలుమారు దున్ని సిద్ధము చేయుదురు. పొట్ల, బీరపాదులను పెట్టుదురు. వరి, చోడిగింజలను జల్లి నారును పెంచుదురు ప్రత్తిని చెట్లనుండి విడదీయుదురు. ఆముదపు కాయలను కోసి ఎండబెట్టుదురు. రెండవ పంట వరిని, చోడిని కోసి కైలు చేయుదురు. పైరునువ్వులను కోసి దులువుచుందురు తొలకరి వానలు కురిసిన వెంటనే మెట్టు దుక్కి ప్రారంభించుదురు. తొలకరి పైరులగు జనుము, కంది, జొన్న, సజ్జ, వంగ, చామ, చోడి, ఆముదము, ప్రత్తి, బుడమ, నూవులను జల్లుదురు. వేరుశనగ పైరును కూడా బెట్టుదురు.

2. వర్షాకాలమున సేద్యగాని పనిపాట్లను గూర్చి క్లుప్తముగా వ్రాయుము?

జ: వర్షాకాల ప్రారంభమునుండియు వరినాటెడు పొలములకు నీరుపెట్టి, దమ్ముచేయుట, ఊడ్చుట, కలుపుతీయుట యందు రైతుల కెక్కువపని గల్గియుండును ఆశ్వయుజమాసము (october) నాటికి జనుముకోసి, కట్టలుకట్టి నారదీయుటకు ఊరబెట్టుదురు. బుడమ, చోడి, చామచేలు కోతకు వచ్చియుండును కత్తిర నూవుచేలు పండియుండును. పునాస వరులను బసంగి, రసంగిచేలుపండి కోతకు సిద్ధముగానుండును. వంగ, మిరప, పొగాకు నారులను పెంచుదురు. వంగ, మిరపనారులను నాటుదురు. ఉలవ విత్తనములను జల్లుదురు. గుమ్మడి, ఆనప, దోస, కాకర, చిక్కుడు పాదులు విస్తరించుచుండును. వేరుశనగ మొక్కలను త్రవ్వుచుందురు,

3. శీతకాలమందలి వ్యవసాయపు పనులను వివరింపుము?

జ: శీతకాల ప్రారంభమందే వరిచేలు కోయుట,కుప్పలు వేయుట,నూర్చుట,గడ్డిని గింజలను జాగ్రత్త పెట్టుటయందు చురుకుగా రైతులు పనిచేయుదురు. వెల్లుల్లి, నీరుల్లి పాతుదురు. శనగ, మినుము, జనుము, పెసర, వరిచేలలో జల్లుదురు. రెండవపంటకై నారుమళ్లను సిద్ధముచేసి వరివిత్తనములను, చోడివిత్తనములను జల్లుదురు. పైరు నూవుచేలకు దుక్కిదున్నుదురు. కంద, పెండలము, పసుపు, అల్లము త్రవ్వుదురు. సంక్రాంతి వెళ్లినపిమ్మట కందిచేలు కోయుదురు.

4. స్వంతతోట డైరీ, బడితోటడైరీ, ప్రకృతి పంచాంగముల నమూనా ఫారములు గీయుము?

జ: 1. స్వంతతోట డైరీ నమూనా:—

| తేది. | చూచినవిషయము. | చేసినపని | రిమార్కులు. | బొమ్మలు. |
|---|---|---|---|---|
| | | | | |

2. బడితోట డైరీనమూనా.

| 1 మడినెంబరు. | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|---|
| 2. పైరుపేరు. | కంది | వరి | శనగ | జొన్న | వంగ | — |
| 3. విత్తనము వేసినతేది. | 11-6-40 | 13-6-40 | 20-6-40 | 21-6-40 | 18-6-40 | — |
| 4. మొలచినతేది. | | | | | | |
| 5. ఆకువేసినతేది. | | | | | | |
| 6. పువ్వు, మొగ్గకన్పించినతేది. | | | | | | |
| 7. పువ్వుపూచినతేది. | | | | | | |
| 8. కాయకాసినతేది. | | | | | | |
| 9. కోతకువచ్చినతేది. | | | | | | |
| 10. పైరుకోసినతేది. | | | | | | |

3. ప్రకృతిపంచాంగము నమూనా:—

| తేది. | కాలమానపరిస్థితి. | చూచినవిషయము | డ్రాయింగు |
|---|---|---|---|
| | | | |

# భూమి - దానియాకారము

వంగర సూర్యనారాయణ హెడ్మాష్టరు ఎలిమెంటరీపాఠశాల-రావెల.

భూమియొక్క ఆకారము

జనులుండునదిభూమి. ఈభూమిసూర్యుని చుట్టు తిరిగివచ్చు గ్రహములలోనొకటి. ఈ గ్రహమనునదిముప్పాతిక భాగము జలముతోను, పాతికభాగము భూభాగముగాను, ఉన్నది. ఈభూభాగము.కొండలు,నదులు, వృక్షసముదాయములు, అనేకవిధములైన మనుష్యాది భూతకోటితోను, నగర గ్రామ పట్టణంబులతోను, నిండి నిబిడీకృతమై యున్నది. అటువంటి భూమిచూచుటకు మిట్టపల్లములుగలిగి బల్లపఱుపుగా కాన్పించును. కాని దీనియొక్క యాకారమువర్తులాకారమైయుండునదియని క్రిందవివరించిన వానివలన నిర్ధారణచేయవచ్చును.

(1) సముద్రపుటొడ్డున నిల్చి దూరము నుండి దరికిజేరవచ్చుచున్న పొగ ఓడను చూచినయెడల మొదటదాని చివరభాగమును, అదిదరికి చేరుకొలదిదానినడిమి అడుగుభాగములును, వరుసగా కనబడుచుండును. అట్లేరేవునుండి వెడలిపోవుచున్ననావను చూచిన మొదట నావయంతయుకనబడితదుపరిపోనుపోను మధ్యయడుగుభాగములు కనబడుచు తరువాత దాని యగ్రభాగమును కనబడియదృశ్యమగును. దీనికి కారణమే మనగా భూమికి సంబంధించిన జలభాగము యొక్కపైభాగము బల్లబఱుపుగా నుండక తెఱచిన గొడుగువలె వంపుగలిగి యుండును.

(2) అనేకులు భూప్రదక్షిణము చేయదలచి తాము బయలుదేరిన స్థలమునకే

చేరియున్నారని తెలియుచున్నది. ఎందు వల్లననగా భూమిబల్లపఱపైనచో అట్లు చేరుట తటస్థించదు. సముద్రయాత్ర చేయ దలచినవా రొకముఖముగా బయలు దేఱలేక, అందందు గొప్పభూభాగముల డ్డుండుటచేత మార్గములు మార్చుకొని పోయి బయలుదేరిన స్థలముననే వచ్చిచేరు దురు. ఇందునబట్టి భూమిగుండ్రముగా నున్నదనిచెప్పవచ్చును.

(3) ఒక వస్తువుయొక్క నీడవస్తువునకు గల యాకారమునే గలిగి యుండును. అట్లే నీడనుగలుగజేయువస్తువు ఏయాకారముగా నుండునో నిర్ణయింపవచ్చును.

చంద్రగ్రహణము పట్టుసమయమందు భూమియొక్కనీడ చంద్రమండలముపై బడు చున్నది. ఆనీడగుండ్రముగా నుండును. చంద్రబింబములో మసుగుపడినభాగము ఖండితమైన వృత్తభాగముగా కనుపించదు కానభూమియొక్క నీడ గుండ్రముగా నుం డుటచే భూమియు గుండ్రముగా నుండవల యునని స్పష్టమగుచున్నది.

(4) భూమిగుండ్రముగాక బల్లపఱపై యుండినచోసమస్తదేశములలోను సూర్యో దయాస్తమయ కాలములొకేతీరుగా నుండ వలయును. కొన్నిచోట్ల ఉదయము కొన్ని చోట్ల మధ్యాహ్నము కొన్నిచోట్ల సాయం త్రము కొన్ని చోట్ల రాత్రి, కొన్నిచోట్ల పగలు మార్పులు గలుగుచున్నవి. మనకు మధ్యాహ్నముగా నున్నప్పుడు మనకు తూర్పుగానుండు వారికి మధ్యాహ్నము దాటియుండును. మనకు పడమరలో నుండు వారి కింకను 12 గంటలు గాకయుండును. కాన అక్కడక్కడ కాలము భేదపడు చుండుటకు భూమిబల్ల పఱపుగాక గుం డ్రముగా నుండుటయే కారణము.

(5) మన మాకాశమున ఉత్తర దిక్కుగా చూచినయెడల 7 నక్షత్రములు కలిగిన సప్తఋషిమండలము కనబడును. ఆమండలమును ఉత్తరార్ధగోళ వాసులు చూడగలరు. మనము చూచు ఏడుచుక్కల లో రెంటికిసూచకములని పేరు. ఈ ఋషి మండల మునకు పైగా ధ్రువనక్షత్ర ముం డును. అదికదలక యొకచోటనే యుండును. దీనినిబట్టి మార్గస్థులు రాత్రులలో దిక్కులు తెలిసికొనవచ్చును. భూమధ్యభాగములో వసించువారికి ఆకాశములో మిక్కిలి దిగు వగాను, దక్షిణయిండియా వాసులకు ఉత్తరదిక్కున దిక్చక్రమునకు పైగాను ధ్రువప్రాంతములకు వెళ్ళిచూచిన ధ్రువ నక్షత్రము తలకుమీదై కనబడును. కాన ధ్రువనక్షత్రము ఒకేచోట నున్నప్పటికిని భూలోకవాసులకు పలువురకు పలువిధము లైన యెత్తులో కనబడుటకు భూమి బల్ల పఱపుగానుండక గుండ్రముగా నున్నదని దీనిభావము, భూమిబల్లపఱపే యైనచో ధ్రువనక్షత్ర మండలకు నొకేవిధమైన యెత్తులో కనబడుచుండును. దక్షిణార్ధ గోళవాసులకు ఈ ధ్రువనక్షత్రము బొత్తి గాకనబడకుండుటకు భూమి గుండ్రముగా నుండుటయే కారణము.

6. మనమొక మైదానములో నిల్చి నాలుగుదిక్కులు చూచినయెడల ఆకాశ మువంక భూమినివలయాకారముగా తాకు టనుచూడవచ్చును. దానికే దిక్చక్రమని పేరు. ఇది నిజముగా ఆకాశము భూమిని తాకుటలేదు. అట్లగపడుటకు కారణము భూమియొక్క గోళాకారమే యీ దిక్చ

క్రమముయెత్తైన ప్రదేశములోనుండి చూచిన యెడల మరికొంత పెద్దదిగా కనబడును.

పై కారణములను చూడగా భూమి నారింజపండువలె గుండ్రాకారము కలిగి యున్నదని నిర్ణయించినను, మనము చూచుటకది బల్లపఱుపుగానే కనబడును.

---

# ఆంధ్రవాఙ్మయము

(గతసంచిక తరువాయి)

కె. ఎ. స్వామి.

ప్రబంధయుగము:-పదునారవ శతాబ్దమాంధ్రవాఙ్మయ చరిత్రలో స్వాతంత్ర్య యుగము. పురాణములలోని యొక విషయమును గ్రహించి దానిని విపులముగా ప్రబంధకవులు వ్రాసిరి. ప్రబంధము పురాణమువలె కథా ప్రధానముగాక భావ ప్రకటనమును వ్యక్తీకరించును. నాయికానాయకులు భావపోషణమునకు ప్రాముఖ్యమిచ్చును. శైలి జటిలముగా నుండును. శ్లేషాద్యలంకారము లమితముగా వాడబడును. శంభుదాసుని ప్రబంధశైలి, శ్రీనాథుని దీర్ఘసమాసములు, పోతరాజు శబ్దాలంకారములు, యీ యుగమున కాదరశములు. తెలుగుకవిత్వమునందు ప్రాబంధికబీజములు నాచనసోమునిలోను, శ్రీనాథునిలోను, గానబడును. పెద్దన, తిమ్మన, రాయలు, రామరాజ భూషణుడు, రామలింగడు, సూరన, ప్రబంధకవులలో ప్రసిద్ధులు. దేవరాయుల కాలమున యీ యుగమత్యుచ్ఛదశలో నుండెను. దీనికి కారణము రాయలు పండితుడగుటయే.

పెద్దన:-మనుచరిత్రము రచించి ప్రబంధములకు మార్గదర్శియయ్యెను. ఇందలికథావస్తువు మార్కండేయ పురాణాంతర్గతము కైకొనబడిన కథావస్తువు ననేక విధముల విస్తరించి మెరుగులు పెట్టెను. పెద్దన ప్రబంధములకొన నిశ్చిత రూపమును చూపెను. ఈతనికి సంస్కృతాంధ్రములందసమాన పాండిత్యము కలదు. రాయలాస్థానమునందలి అష్టదిగ్గజములలో పెద్దన ముఖ్యుడు. మనుచరిత్రకు స్వారోచిషమను సంభవమనికూడ వేరొక పేరు గలదు. ఈతనికి రాయలాంధ్రకవితాపితామహుడను బిరుదమిచ్చి మిగుల సన్మానించెను. ఆంధ్రభారతిని పల్లకులపై నూరేగించిన దీయుగమందే. శ్రీకృష్ణదేవరాయలు మనుచరిత్రను కృతిగైకొను నపుడు పెద్దనను పల్లకిపై నూరేగించెను. ఆకాలమున విజయనగరాస్థానమే అఖిలాంధ్ర సరస్వతికి విద్యాపీఠము. పెద్దన కవితగమన వేగము నందఖండ గౌతమీ ప్రవాహము వోలెనుండును. ప్రబంధయుగాంధ్రపుం గయితకు బెద్ద పెద్దన. పెద్దన కవితయందు ప్రకృతివర్ణన లధికము.

“ముద్దుల మాటగట్టు నుడి-పొంకము
నందును మేల్మికూరుపుం
బద్దపుబింకమందు రస-బంధమునం
దుఁ గథాప్రకారముం

దిద్దెడు తీర్పునందు గడి-దేలిన మా
కవితాపితామహున్
బెద్దన నాంధ్రపుంగయిత-పెద్ద
నసారతమున్ దలంచెదన్"
చే॥ ప్ర॥

పెద్దన హరికథా సారమును గూడ రచించెనటగాని మనకది నేటివరకు లభించినట్లగపడదు.

తిమ్మన పారిజాతాపహరణము ముద్దులమూట గట్టుచుండును. కృష్ణదేవ రాయలు "ఆముక్తమాల్యద"నురచించెను. ఇందలి శైలినారికేళ పాకమునంటిది. ఇందుగల వర్ణనలు హృదయరంజకమైనవి. దేవరాయలు రాజకవి. రామరాజ భూష ణుని వసుచరిత్ర శబ్దాలంకారములందు భాగవతమును మించును. ఈతని యితర గ్రంథములు నరసభూపాలీయము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము. ఈతనికి భట్టుమూర్తి యను నామాంతరముగలదు. రామలింగడు వ్యర్థపదరహితముగ "పాండురంగమాహాత్మ్యము"ను రచించెను. ఈ కావ్యములోని కథలు నీతిబోధకములు. ఘటికాచల మాహాత్మ్యము, ఉద్భటారాధ్య చరిత్రము నితని యితర గ్రంథములు. ఈతని శైలి నిర్దుష్టమైనది. పింగళి సూరన ప్రబంధయుగ చక్రవర్తి. ఈతని గ్రంథములు రత్నములు. ప్రభావతీ ప్రద్యుమ్నము మనోహరమైనసాటకప్రబంధము కళాపూర్ణోదయ మందలి కథ నవలను బోలియున్నది. ఈతని గ్రంథములందు కథాసంవిధాన మతిచమత్కారముగా నిర్వహింపబడినది. ఈతని రాఘవపాండవీయము ఆంధ్రభాషకు చేయుచున్న సేవ అపారము. రామాభ్యుదయ కర్త రామభద్రుడు. రామాయణము వ్రాసిన మొల్ల, కవికర్ణ రసాయనము వ్రాసిన సంకసాల నృసింహకవి, రాజశేఖర చరిత్ర వ్రాసిన మల్లన, యీ యుగమందలి యితరకవులు.

నిర్వికాసయుగము:- ఈ యుగము ప్రబంధ యుగమందలి ద్వితీయపాదము. ఈయుగమున భాషాద్రోహ మారం భించినది. కవనము మాత్రమధికముగనే యుండెను. నిజమైన కవి యొక్కడునుగాన రాడు. ప్రాచీనుల పద్యములనే మార్చి మార్చి వ్రాయ మొదలిడిరి. స్త్రీ వర్ణనలు మితిమీరినవి. పోషకులగు భోగపరాయణుల మెప్పించ ప్రయత్నించిరి. శ్లేషకు హద్దులేదు. ద్వ్యర్థికావ్యములు, చిత్రకావ్యములు, బంధకావ్యములు, పాదనూపి విజృంభించినవి. కాని భావసారస్వతము వంక కెవ్వరును బోరైరి. దక్షిణమున మైసూరురాజులయు, మధురరాజులయు, నాస్థానములందు కొందరు కవులువెలసిరి. చేమకూర వేంకటకవి "విజయవిలాసము"ను రచించెను. కూచిమంచి తిమ్మకవి రచించిన "అచ్చతెనుగు" ప్రబంధములసంఖ్యాకములు. ఈతని పద్యములు తేనెలొలుకును. ఈతని కెనయగు అచ్చతెనుగు కవిచంద్రుడు మరియొకడు గానరాడు.

సీ॥ పార్థిమైరుక్మిణీ పరిణయంబును-సింహ
శైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కథయును-రాజశేఖర విలాసంబును
నచ్చతెనుంగు రామాయణంబు
సారంగధర నరేశ్వర చరిత్రంబు, స
ర్పాద్రవసంగ మాహాత్మ్యకంబు
రసికజనమనోభిరామంబు, లక్షణ
సారసంగ్రహమును, సర్వపురస
మంచితక్షేత్రకథనంబు, మతియుఁ బెక్కు
శతకదండక సత్కృతుల్, ప్రతిభగూర్చి

యుల్లమలరార, పార్వతీవల్లభునకు
భక్తి సర్పణజేసిన భవ్యమతి

మరియు, సీతడు శివలీలా విలాసమను నొక ప్రబంధము నుగూడ రచించెను.

రాధికాస్వాంతనము వ్రాసిన ముద్దు ఫళని, తారాశశాంకమును వ్రాసిన శేషము వేంకటపతి, యీకాలమువారే.

అడిదము సూరకవి:–ఈతడు చీపురు పల్లి నివాసి. విజయరామ రాజాస్థానకవి. 1800 నాటివాడు. ఇతడు రచించిన కావ్యము కవిజన రంజనము. ఈకావ్యమును చంద్రమతీ పరిణయమనియు, పిల్లవసు చరిత్రయనియు, మనము గౌరవించుచున్నాము. ఈతడు రామలింగేశ శతకమును రచించెను. మఱియు ననేక గ్రంథములను రచించెను. ఈతని రామలింగేశ శతకము సంస్కృత భూయిష్టము కానిది. మృదువైనది. సాగసైన శైలికలది. ఈ మార్గమున తెలుగు సారస్వతమున విజృంభించి దానికి స్థిరత్వమొనగూర్చినవారు తిరుపతి వేంకటకవులు. ఈతనికి చాటు కవిత్వమున ప్రజ్ఞయధికము.

వచనరచన:—ఈ యుగమున వచన రచనకు ప్రాముఖ్యము హెచ్చినది. వచన రచన పద్యరచన కెందును దీసిపోదని స్థిరపడినది. భారతము రచించిన కళులె వీర రాజు జైమినీ భారతము రచించిన సముఖము వేంకట కృష్ణప్పనాయకుడు, శ్రీరంగమాహాత్మ్యము రచించిన విజయరంగ చొక్క నాథుడు, రామాయణ కర్త శ్యామరాయ కవి, యీ యుగమందలి వచన రచయితలలో సుప్రసిద్ధులు.

(సశేషము)

# హిందూదేశ చరిత్ర-ప్రశ్నోత్తరములు

## ఐదవ తరగతి

(ఏప్రెలు సంచిక తరువాయి)



By

తాతా జగన్నాథరావు, హెడ్మాష్టరు బోర్డు ఎలిమెంటరీస్కూలు శోంత్యాం.
వేదుల అన్నయ్యశాస్త్రి - హెడ్మాష్టరు - బోర్డుఎలిమెంటరీస్కూలు, గురమ్మపాలెం.

Syllabus Heading —The kingdom of Vijayanagar.

1. ఢిల్లీ సుల్తానెవరు ?

జ. మహమ్మద్ బీన్ తుగ్లక్.

2. హరిహరరాయలు అనెగొందెకు ప్రతినిధి యెట్లయ్యెను ?

జ: తుగ్లక్ దక్షిణదేశముపై దండెత్తివచ్చినప్పుడు అనెగొంది రాజును జయించి, హరిహరరాయలను ప్రతినిధిగా జేసెను.

3. విద్యానగరమనగేది ? దానికా పేరెట్లువచ్చెను.

జ: హరిహరరాయలు నిర్మింపచేసినపట్నము విద్యానగరము. తనగురువును గౌరవింప నానగరమునకు విద్యానగరమని పేరిడెను.

4. విజయనగరరాజ్య మెంతవరకు వ్యాపించెను ?

జ: విజయనగర రాజ్యము కృష్ణానదిమొదలు, కావేరీనదివరకు వ్యాపించెను ?

జ: విజయనగర రాజ్యము కృష్ణానదిమొదలు, కావేరీనదివరకు వ్యాపించెను.

5. ఈ రాజ్యము నేయేవంశపురాజులు పాలించిరి ?

జ: ఈ రాజ్యము సంగమవంశమువారిచే స్థాపించబడి, క్రమముగా సాళువ, తులువవంశజులచే పాలించబడెను.

6. కృష్ణదేవరాయలు ఏవంశజుడు ? యితనినిగూర్చి క్లుప్తముగా వ్రాయుము ?

జ: ఇతడు తులువవంశజుడు 1509 మొదలు 1529 వరకు రాజ్యమేలెను, గొప్పవిద్వాంసుడు. మైసూరు, ఒరిస్సారాజులను, ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి, రాయచూరు కోటలను, బీజపూరు, గోలుకొండ, సుల్తానులను జయించెను. ఇత డాంధ్రభాషను పోషించి ఆంధ్రభోజుడను బిరుదునొందెను.

7. విజయనగరమును పాడుచేసిన సుల్తానెవరు ?

జ: రామరాజు కాలమున భామినీరాజ్యము నేలుచున్న సుల్తానులందరు దండెత్తి రాజునుజంపి, జయనగరమును కాల్చి నేలపాలుచేసిరి.

8. ఈ విజయనగరమే జిల్లాలోనున్నది ? ఆనగరమందలి వింతలేమి ?

జ: ఈ విజయనగరము బళ్ళారి జిల్లాలోనిది. యిందు దేవాలయము, బజారువీధులు, కోటగోడలు, నూతులు, కాల్వలు చూడదగినవి.

9. హిందూదేశ పటముగీసి అందు విజయనగర సామ్రాజ్యమును గుర్తింపుము ?

జ: ♦ ♦ ♦ ♦ ♦

Syllabus Heading—The rise and fall of the Moghul Empire; Baber, Akbar and Aurangazeb.

1. మొగల సామ్రాజ్య స్థాపకుడెవడు ? ఏ వంశజుడు ?

జ: మొగల్ సామ్రాజ్యమును బేబరు స్థాపించెను. ఇతడు తైమూరు వంశజుడు.

2. ఈ సామ్రాజ్యమును వృద్ధిచేసినదెవరు ? క్షీణింపజేసిన దెవరు ?

జ: ఈ సామ్రాజ్యము అక్బరుకాలమున వృద్ధిజెందెను. ఔరంగజేబు కాలమున క్షీణించెను.

3. ఇబ్రహీమ్ లోడీ ఎవరు :

జ: ఇతడు ఢిల్లి సామ్రాజ్య చక్రవర్తి.

4. మొదటి పానిపట్టు యుద్ధమును గూర్చి క్లుప్తముగా వ్రాయుము ?

జ: ఇబ్రహీమ్ లోడీ బహుక్రూరుడు. ఇతడు ప్రజల ననేకవిధముల బాధించుచుండెను యీ సంగతి హిందూదేశముపై దండెత్త నూహించుచున్న బాబరునకు దెలిసి గొప్ప సైన్యమును చేకూర్చుకొని హిందూదేశముపైకి దండెత్తివచ్చెను. లోడీకిని, బాబరునకును పానిపట్టువద్ద యుద్ధము జరిగెను. యిదియే మొదటి పానిపట్టు యుద్ధము. యీ యుద్ధములో బాబరు లోడీని చంపి ఢిల్లీని వశముచేసికొనెను

5. సంగ్రామసింహు డెవడు ? ఇతడు బాబరును ఎచ్చట నెదుర్కొనెను ? దాని ఫలితమేమి ?

జ: సంగ్రామసింహుడు రాజపుత్రులనాయకుడు ఇతడు బాబరును సిక్రీవద్ద నెదుర్కొనెను సంగ్రామసింహుడు మహావీరుడు. దేశాభిమాని. ఈ యుద్ధములో బాబరునకే జయము గల్గెను.

6. బాబరెన్నవఏట మృతినొందెను ? ఇతని కుమారుడెవడు ?

జ: బాబరు 49 వ ఏట చనిపోయెను. ఇతని కుమారుడు హుమయూన్.

7. అక్బరెవడు ? ఎన్నవఏట రాజ్యమునకు వచ్చెను ? తనపేరిట రాజ్యమేలినవాడెవడు ?

జ: అక్బరు హుమయూన్ కుమారుడు. 16 వఏట రాజ్యమునకు వచ్చెను. ఇతడు మైనరగుటచేత బైరాంఖానను సేనాధిపతి అక్బరు పేరిట రాజ్యమేలెను.

8. అక్బరు తనరాజ్యము నెంతవరకు వ్యాపింపజేసెను ?

జ: అక్బరు సింహాసనమునకు వచ్చినప్పుడు ఢిల్లీ పంజాబు రాష్ట్రములకు మాత్రమే యితడు ప్రభువు. కాని క్రమక్రమముగా కాబూలు, కాశ్మీరము, బీరారు, గుజరాతు, బంగాళము, బీహారు, అహమ్మదు నగరము మొదలగు రాజ్యములను జయించి తనరాజ్యమును గోదావరి సరిహద్దులవరకు వ్యాపింపజేసెను.

9. ఏ కారణములవలన అక్బరు యెడల హిందువులు మైత్రి కలిగి అతని రాజ్యాభివృద్ధికై పాటు పడిరి ?

జ: అక్బరు రాజపుత్రులమైత్రికై పాటుపడెను. హిందువులకు పెద్దయుద్యోగముల నిచ్చెను. హిందూ స్త్రీలను వివాహమాడెను. హిందువుల కసహ్యకరమగు గోహత్యను మాన్పించెను. జిజియా పన్నును రద్దుచేసెను. యీకారణములవలన హిందువులు అక్బరు ఎడలమైత్రి గలిగి అతనిరాజ్యాభివృద్ధికై పాటుపడిరి.

10 ఔరంగజేబు ఎవరికుమారుడు ? ఎట్లురాజ్యమునకు వచ్చెను ?

జ ఔరంగజేబు షాజహాను చక్రవర్తి యొక్క మూడవకుమారుడు. తండ్రిని కారాగారమునందుంచి అన్నదమ్ములను చంపి రాజ్యమునకువచ్చెను.

11. ఔరంగజేబునుగూర్చి క్లుప్తముగా వ్రాయుము ?

జ: ఇతడు పరాక్రమశాలి భక్తియు, స్వమతము నందభిమానమును గలవాడు. ప్రతిదినము ఖురాన్ చదువుట, నమాజుచేయుట యితనికలవాటు ఇతడు చక్రవర్తిఅయ్యును పన్నులమూలముగా వసూలు చేసిన ప్రజలధనము నాశించక ఖురాను వ్రాసి అమ్మియు, టోపిలుకుట్టి అమ్మియు తనకుకావలసిన సొమ్ము సంపాదించి జీవితము గడిపెడివాడు. యితనికి సంగీతమన్న యిష్టములేదు. ఇతనికి మహమ్మదీయ మతము నందభిమానము ను, యితర మతములపై నసూయయు మెండు. ఈకారణమున హిందువుల ననేక భంగుల బాధలు పెట్టెను.

12. మొగల సామ్రాజ్యనాశనమునకు ముఖ్యకారణములేవి ?

జ: ఔరంగజేబుయొక్క అన్యమతద్వేషమే యిందులకు ప్రబలకారణమై యితనికాలముననే మొగలు సామ్రాజ్యము క్షీణించమొదలిడెను

13 హిందూదేశపటము వ్రాసి బేబరునాటియు, అక్బరునాటియు, ఔరంగజేబునాటియు మొగల సామ్రాజ్యములను వేర్వేరు రంగులతో గుర్తింపుము ?

జ: ♦ ♦ ♦ ♦ ♦

---

# సంగీతము

పి. సుదర్శనరావు

శిల్పము, చిత్రలేఖనమువలెనే సంగీతముకూడా ఒకకళ. చతుష్షష్టి కళలలో లలితకళలు ప్రాముఖ్యమైనవి. అందు గానకళ సర్వోత్కృష్టమైనది. మరియు కష్టసాధ్యమైనది. శిల్పము, చిత్రలేఖనములలో సృష్టియందలి జంతు పక్షి వస్తు వృక్షాదులు చిత్రింపబడుచున్నవి. గానకళ యట్లుగాక స్వరూపరహితమై వాయురూపమున నున్న ధ్వనివిశేషము. కనుక లలితకళ లన్నిటిలో గానకళ మిగుల కష్టసాధ్యమైనదని చెప్పబడుచున్నది.

అట్టి గానకళ మానవులకు ప్రాకృతకర్మానుసారమైన విశేషమువలన గాని లభింపనేరదు. సంగీత కళాభ్యాసమునకు శ్రుతి, లయ, రాగజ్ఞానములు, సహజముగా నుండవలెను. అనగా సంగీతశాస్త్ర

మునందు కళానిపుణుడు కాని వాడు గాయకుడు కానేరడు. మఱియు నిది సహజముగా లోకలిననడి రావలెనినదే కాని ప్రయత్నమువలన తెలుపవలెనని తెచ్చుకొనవలసినది కాదు. గాయకునకు స్వరజ్ఞానము, లయజ్ఞానము, చాలా అవసరము. స్వరజ్ఞానము, తాళజ్ఞానము లేని వాని గానము దోషయుక్తమగు కవిత్వము వలె గ్రుడ్డిగానుండును. ఇంక కవిత్వమునకు వలెనే గానమునకు కూడ రసముప్రధానము. అదిలేని గానము ఎంతటి భావనా శక్తిగలదైనను పరిమళములేని పుష్పము వలెనే శోభించనేరదు.

సంగీతము, జంత్రము, గాత్రము అని ద్వివిధము. గాత్రముకంటె జంత్రగానమే ఉత్కృష్టమైనది. గాత్రములోకంటె జంత్ర సంగీతములో కళాప్రదర్శనమునకు కొంత స్వేచ్ఛ ఉన్నది. కొన్ని సంగతులు గాత్రమున పలుకుటకు అవకాశముండదు. వాటిని జంత్రమునందు సులువుగా పలికించవచ్చును.

సంగీతకళను పూర్వము మహారాజులగువారు విశేషముగ నాదరించిరి. గుప్త వంశపు రాజులలో చంద్రగుప్త మహావీరుని తండ్రియగు సముద్రగుప్తునికి సంగీతమన్న మిక్కిలి యిష్టము. ఇతడు చాల మందిగాయకులను పోషించెను. ఈ చక్రవర్తి తన నాణెములపై తొడపై వీణనుంచుకొని పాడుచున్నట్లు బొమ్మను ముద్రించుకొని తనకు సంగీతమునందుగల యభిమానమును ప్రకటించెను. దీనివలన అతని సంగీతకళా కౌశల్యము తెల్లమగుచున్నది.

మహమ్మదీయులలో మొగలువంశస్థుడైన బేబరుచే సంగీతమున రచించిన గ్రంథములు గలవు. కాని ఔరంగజేబు గానమును దూరముగ దరిమివైచెను. సంగీతమును విని ఆనందించుటకు ఇతడు ఇష్టపడడు. ఇతని కాలమున సంగీతమునకు ఆదరణలేదనియు, సంగీతమన్న నీతనికంత ద్వేషమనియు తెలుపుటకొక కథకలదు. ‘ఒక రోజున ఔరంగజేబు తనమేడపైన మతగ్రంథమును పఠించుచుండగా వీధిలో నెవరో పెద్దగా నేడ్చుచున్నట్లు వినిపించెను. చక్రవర్తి గవాక్షమునుండి తొంగిచూచెను. వీధిలో చాలమంది చేరియుండిరి ఆగుంపుమధ్య నొక శవము కాన్పించెను. ఔరంగజేబు ఎవరు చనిపోయిరని వారిని ప్రశ్నించెను. వారు కడు విచారముతో సంగీతము మీ రాజ్యమున చనిపోయినదని చెప్పిరి. ఔరంగజేబు ‘ఆసంగీతమును లేకుండ గోతిలో పూడ్చుడి’ అని చెప్పెను.

ప్రస్తుతము సంగీతకళకు (పూర్వము వలె) రాజపోషణలేదు. ప్రభుత్వాదరణముగూడ లేకుండనున్నది. ఇది గాయకుల యొక్కయు, గానకళయొక్కయు, దురదృష్టమున వచ్చును. అయినను ఇటీవల కొంతవరకు నీకళయందలి ప్రాముఖ్యమును ప్రభుత్వమువారు గుర్తించి ప్రస్తుత విద్యావిధానమున నొక స్థానము నీకళకుకూడ నిచ్చి కొన్ని పరీక్షలు యేర్పరచి శ్రీవారికి యీ కళయందు గల గౌరవాభిమానమును కొంతవరకు వెల్లడించిరి. ప్రాథమిక పాఠశాలలలో సంగీతము ఏ యే తరగతికి ఎంతెంత నేర్పవలసినది శ్రీ మద్రాసు ప్రభుత్వమువారి 1939 సంవత్సరపు ప్రాథమికవిద్యా విషయిక ప్రణాళికలో బ్రక

టింపబడినది. ఉపాధ్యాయ సోదరులు గమనించెదరుగాక.

*　　*　　*

౧

1. "స రి గ మ - ప ద ని స
స ని ద ప - మ గ రి స
2. స రి గ మ - స రి గ మ
స రి గ మ - ప ద ని స
స ని ద ప - స ని ద ప
స ని ద ప - మ గ రి స
3. సరి సరి గమ - రిగ రిగ మప
గమ గమ పద - పద పద నిస
సని సని దప - నిద నిద పమ
పమ పమ గరి - మగ మగ రిస."

౨

1. "సస రిరి గగ మమ
పప దద నిని సస
సస నిని దద పప
మమ గగ రిరి సస.
2. సారీగామా - పాదానీసా
సానీదాపా - మాగారీసా.
3. సా - సరిగమ - రీ రి - గమప
గా - గమపద - మా - మపదని
పా - పదనిస - సా - సనిదప
నీ - నిదపమ - దా - దపమగ
పా - పమగరి - మా - మగరిస."

N. B: ఏలూరు, రామా అండ్ కో, వారు ప్రచురించియున్న "బాలగానమాలలు" ఎలిమెంటరీ పాఠశాలలలో ఆయా తరగతులకు ఉపయోగించ వచ్చును.

---

# రైతు పలుకులు

పి. సుదర్శనరావు

"కృషితో నాస్తి దుర్భిక్షమ్"
సేద్యము చేసేవాడే రైతు
చేనికుదురు, ఆలికుదురు, ఉండవలెను.
పాడిదాచవలెను, పంటపొగడవలెను.
మడికిగట్టు, యింటికిగుట్టు, మంచిది.
బడిలేనిచదువు, వెంబడిలేని సేద్యము, పనికిరాదు.
ఎద్దులేని సేద్యము, చద్దిలేని పయనము.
ఎద్దులబలమే వ్యవసాయకునకు బలము.
పొలములో పొలముదొరికినా, స్థలములో స్థలముదొరికినా, పోనివ్వరాదు.
పల్లం దున్నినవాడూ, పల్లకీ ఎక్కినవాడూ, ఒకటి.
తల్లిని నమ్మిన వాడూ, ధరణిని నమ్మినవాడూ, చెడడు.
దొరలుయిచ్చిన పాలుకన్న ధరణియిచ్చిన పాలుమేలు.
ఒంటికి తిండిపుష్టి, వరికి దుక్కిపుష్టి.

దుక్కిచలు వేచలువ, తల్లిపాలేపాలు.
దుక్కిగలభూమి, దిక్కుగల మనుజుడు, చెడడు.
కలుపుతీయనిమడి, దేవుడులేనిగుడి.
పుట్టమన్ను వేస్తే భూములుపండును.
సున్నపుయెరువులు శనగకు మంచిది.
ఆముదాలపిండి చెఱకుకుదండి
వరికినీరు - చెఱకుకుపిండి
వేపపిండి యెరువుతో సమానము.
పచ్చజొన్న పైరుగోంగూర.
అయితే ఆరిగ, కాకుంటేకంది.
వంగముదురు, వరిలేత.
అత్తియేలిన కోడలు, చిత్తపట్టిన వరిచేను, బాగాపండును.
తొలకరిని చెఱువునిండినా, తొలిచూలికొడుకుపుట్టినా, లాభం
మడిని బడ్డనీరు, పైనబడ్డదెబ్బ, పోనేరవు
అశ్వినికురిస్తే అంతానష్టము.
భరణికురిస్తే ధరణిపండును.
భరణియెండకు బండలు పగులును.
రోహిణియెండకు ఱోళ్లు పగులును.
మృగశిరకార్తిలో ముంగిళ్లు చల్లబడును.
ఆరుద్రవాన అదనువాన.
ఆశ్లేషవాన అరికాలు తేమ.
ఉత్తరచూచి యెత్తరగంప.
విశాఖచూచి విడువరకొంప.
వృష్టికి ప్రమాణము ఉత్తరాహస్తలు.
స్వాతివానకు ముత్తెపు చిప్పలు.
విశాఖలోవర్షము వ్యాధులకు హర్షము.
ఆరుద్రతో అదనుసరి.
ఆరుద్ర బిందిస్తే అరవైదినాలు వరపు.
ఆరుద్రలో వర్షముకురిస్తే, ఆరుకార్తెలు కురియును.
వానలకు ఋతువుసుఖు.
పుబ్బకెరలితే భూతముకెరలినట్లు.
మూలవాన ముంచకతీఱదు.
కర్కాటక వర్షమునకు కొడిమోకు తడియదు.
చిత్తస్వాతులు వర్షించకపోతే చిగురుటాకులు మాడిపోవును.

ఆరుద్రలో అడ్డెడు చల్లితే పుట్టెడు పండును.
పుబ్బలో పుట్టెడు చల్లుటకంటె ఆశ్లేషలో అడ్డెడు చల్లుట మేలు.
హస్త చిత్త తలుపోతే అందరి సేద్యం ఒకటే
కరువుకి జొన్న, వర్షానికి వరి పండును.
వానరాకడ, ప్రాణము పోకడ, తెలియదు.
చంద్ర పరివేషము వర్షయోగము.
దూరం గుడికట్టితే - దగ్గర వాన; దగ్గర గుడికట్టితే - దూరం వాన.
తూనీగలాడితే తూమెడు వర్షము.
కోడి రెక్కను ఆరవేసికొంటే గొప్పవర్షము కురియును.
వానకుముందు ఉరిమినా, కార్యముముందు ఏడ్చినా, తుదముట్టదు.
వట్టిగొడ్డుకు అరుపులు మెండు, వర్షములేని మబ్బుకు ఉరుములు మెండు.
మిన్ను ఎర్రనైనా, కన్ను ఎర్రనైనా, కారక మానవు.
పడమట మెఱసిన పదిగడియలకు వర్షము.
మామిళ్లు మగ్గినా, నేరేళ్లు నిగ్గినా, ఫలము పెద్ద.
బలుసులు పండితే వరి పండును.
నేరేళ్లు పండితే నేలలు పండును.
చింత పండితే జీడి పండదు.
కవిలి పండ్లు పండితే కఱవులు వచ్చును.
మామిళ్లకు మంచు చెఱుపు.
కొబ్బరిచెట్లకు కుడితి మృత్యువు.
మనిషికి ఉన్నది పుష్టి; పసరమునకు తిన్నది పుష్టి.
తల్లిని చూచి పిల్లను, పాడిని చూచి బఱ్ఱెను, తీసికొనవలెను.
ఎక్కువ వెల పెట్టి గుడ్డను, తక్కువ వెల పెట్టి గొడ్డును, కొనరాదు.

---

# గుఱ్ఱము - వస్తుపాఠము

వేదుల సూర్యనారాయణశాస్త్రి

ప్రశ్న:- ఏ మృగమును కట్టినబండిలో ప్రయాణము చేసిన శీఘ్రముగా పోగలుగుదుము ?

జవాబు. గుఱ్ఱపుబండి.

I. రూపము.

1. తల—పెద్దది. కోలగానుండును.

2. కన్ను—పెద్దది. గుండ్రముగా నుండును.

3. చెవి—నిడివిగా నిక్కియుండును. కండ్లలో నేదియయిన ఈగ, దోమ మొదలగునవి వాలినయెడల వాటిని చెవుల నాడించి తోలును.

4. మెడ—నిడువుగా నుండును. మెడమీద వెండ్రుకలు పై భాగమునందు మొలిచి వ్రేలాడుచుండును.

5. వీపు—మనుష్యులు కూర్చుండుటకు తగిన విధముగాను, వెడల్పుగాను లోపలికి వంపుగను ఉన్నది.

6. కాళ్ళు—వేగముగా పరుగెత్తుటకు వీలగునట్లు సన్నముగను, నిడివిగాను, మంచిబలముగాను ఉన్నవి.

7. గిట్టలు—చీలికలేక యొకటే తుండుగానుండును.

8. వెండ్రుకలు—శరీరమందంతటను దట్టముగా చిన్న వెండ్రుకలు గలవు. మెడమీద జూలుపొడవుగా వ్రేలాడుచుండును.

9. తోక—నిడువుగా వెండ్రుకలే వ్రేలాడుచుండును.

II. ఆహారము—పచ్చిక, ఉలవలు, శనగలు నానబెట్టి, ఉడుకబెట్టి దాణా వేయుదురు.

III. స్వభావము—(1) శీఘ్రముగా పరుగెత్తును. (2) సకిలించును. (3) దానిని కొట్టవచ్చిన వారిని తన్నును, కఱచును. (4) నిలుచుట కిష్టముగలది. (5) మచ్చిక పడిన యెడల తనయజమానుని గుర్తెరిగి వానియందు విశ్వాసము గలిగి పనిచేయును. (6) లగాములచే తెలియజేయబడు గుర్తులను దెలిసికొని మెలగును.

IV. ఉపయోగములు:—

(1) బరువులుమోయును. (2) బండ్లులాగును. (3) దీనిమీద ఎక్కి యుద్ధము చేయుదురు. (4) స్వారిచేయుదురు. (5) వేటాడుటకు దీనిమీద నెక్కిపోదురు. (6) కొన్ని దేశములయందు నాగళ్లకు గట్టి పొలము దున్నుదురు.

---

# ఆహార విజ్ఞానము

ఏలూరు వెంకటరమణమూర్తి

1. మనము ఆరోగ్యవంతులముగ, శక్తివంతులముగ, నుండవలెనన్న మనము A. B. C. D. E. విటమినులను, కాల్సియమ్, మెగ్నిషియమ్, పొటాషియమ్, సోడియమ్, లోహములునుగల పదార్థములను తినవలెను.

ఇవన్నియు కొంచెముగనో, లావుగనో, తినుచుండవలెను. లేనియెడల వాని లోపములచే, కొన్ని వ్యాధులు కలుగును. అందు

A. విటమినుః—ఇదిపాలు, వెన్న, పాలవిరచినసీరు, గృడ్లలోనిఖాలాగము, శరగడము, ముల్లంగిదుంపలు, గుండెలు,_ కాలేయను, కాడ్లివరాయలు, తాజాఆకుకూరలు, పెరుగు, కల్తీలేని నేయి వీనిలోనుండును. నేతిని మిక్కిలికాచిన యెడల అందుండు A విటమినుపోవును. ఇది లేనందువలన కలుగువ్యాధులు.

1 రేచీకటి, 2 రక్తహీనత 3 శరీరదుర్బలత, 4 పండ్లు, చెవులు, ఆమాశయ పక్వాశయ, ఊపిరితిత్తులకు సమ్మంధించిన వ్యాధులువచ్చును.

B. విటమినుః—ఇది వరిబియ్యపు తవుడు, గోధుమలు, దంపుడుబియ్యం, మజ్జిగ, పచ్చనిపండ్లు, దుంపలు, తేనె, పప్పులు, ఆకుకూరలు, సోయాబీన్సు, గోధుమ మొల్టు, వీటిలోనుండును. ఇది లేనందువలన కలుగు వ్యాధులు.

1 నంజు, మలబద్ధము, శరీరపుస్వాభావికము, వేడితగ్గుట, శరీరము పొంగు కార్జపు సంబంధమైన వ్యాధులు కలుగును.

C విటమినుః—నారింజ, నిమ్మ, బత్తాయి, దాక్షఫలములందును, పచ్చికాయలందును ఉండును. ఎండబెట్టినవిగాని, ఊరవేసినవిగాని, ఎన్నిపదార్థములు తిన్నను పైనిచెప్పిన పదార్థములు తినకపోయిననూ ఆయూజబ్బులు వచ్చును.

1 ఇగుళ్లనుండి రక్తము ప్రసవించుట, కాళ్లువాచుట, అతిసారముపుట్టుట-పండ్లుగాని పచ్చికాయలుగాని దొరకక ఓడలమీాదనె యుండి, మాంసము, చేపలు, తినువారికే యీారోగములు వచ్చును. పండ్లు, పచ్చికాయలు తినువారికి యీారోగములు తగ్గును.

D విటమినుః—ఇదిపాలు, వెన్న, నెయ్యి, కాడ్లీవరాయలు, వీటియందుండును. యీాపదార్థములు, పిల్లలకు యివ్వకున్నందున కలుగురోగములు.

1 నిద్దుర పట్టకపోవుట, చిరాకుచేయుట, ఎముకలు, కండలు మెత్తబడుట, చర్మము ముడుతపడుట-ఇత్యాదిరోగములు కలుగును.

E విటమినుః—గోధుమలు, మాంసము, పచ్చికాయలు, వీటియందుండును. ఇవి తిననిచో స్త్రీలు గొడ్డువారగుదురు. సంతానము కలిగిననూ నిలువదు. అల్పాయుర్దాయముగల పిల్లలుపుట్టి, చిన్నతనముననే చనిపోవుదురు.

---

# ఆరగింపుపాట - రూపకం - ఆనందభైరవి

(బాల-బాలికలకుపయుక్తమగునట్లు) 1-5 త॥ కు

1 ఆరగింపరా - హరి - ఆరగింపరా॥
ఆరగింపరార మేమతి । కూరిమి నీకిడినయీాఫలా।
హారములను మాదుకనుల పండువుగా ప్రేమమీార॥ఆర॥

2 గొల్లవనిత లెల్లనీకు । చల్లపాలు వెన్నలొసగ
మెల్లమెల్లగ నడుగులిడుచు । వెళ్లినటుల ముదముమీర ॥అర॥
3 ముద్దులొలుకు మోముతోడ । ముదమగు చిరునగవుతోడ
గజ్జెలందెయలాడ శ్రీహర । గోపాలుడవై ముదమున ॥అర॥
4. అభయహస్త మొసగుచు మా । అమ్మ శ్రీలచ్చమాంబతోడ ।
అతికరుణను మాదగునీ । అల్పాహారముల దయతో ॥అర॥
5. మధురప్రేమరసములతో । కొదువలేనిభక్తితో మా ।
హృదియను నవనీతము నీ కిచ్చుశక్తి మాకు నిచ్చి ॥అర॥

---

# బాలవిజ్ఞానము

తేజోమూర్తుల మల్లికార్జునుడు

అనగా అనగా వొక వూళ్లో ఒక కాపున్నాడు. అతడొక బాతును పెంచుకున్నాడు. దానికి నాలుగు పిల్లలున్నాయి. ఆ పిల్లలపేర్లు

1. "రావేగుమ్మాడీ
2. రత్నగుమ్మాడీ
3. పేరు పేర్లు
4. పెద్దప్పదొరసానీ

అని అల్లారుముద్దుగా పిల్చుకునేది. తల్లిబాతు ప్రతిరోజు మేతకువెళ్లే టప్పుడు తన నాలుగు పిల్లల్ని పిలిచి తలుపువేసుకోమని చెప్పి మరి వెళ్ళేది. తిరిగి మేతమేసి యింటికివచ్చి–

" రావే రావే గుమ్మాడీ ! తలుపుతియ్యవే
రత్నగుమ్మాడీ ! తలుపుతియ్యవే
పేరు పేర్లు ! తలుపుతియ్యవే
పెద్దప్పదొరసాని ! తలుపుతియ్యవే "

అని పిలిచేది. ఆ మాటలు బాతుపిల్లలు విని తలుపుతీసేవి. ఇలా కొన్నాళ్లు గడిచించి. ఒకనాడు తల్లిబాతు మామూలుగా మేతకువెళ్లింది. తల్లిలేని సమయం కనిపెట్టి ఒక వేటకాడువెళ్లి వాళ్లతల్లి పిలిచినట్టుగానే "రావే రావే గుమ్మాడీ ! తలుపు తియ్యవే " అని పేరుపేరు వరసపెట్టి పిలచేడు. తల్లికాబోసు వచ్చిపిలుస్తోందనుకొని అవి తలుపుతీసేయి. వాటిని సంచిలోవేసుకొని వాడు యింటికిపోయేడు. తల్లిబాతు మేతకివెళ్ళి వచ్చి మామూలుగా "రావే రావే గుమ్మాడీ ! తలుపుతియ్యవే రత్నగుమ్మాడీ తలుపుతియ్యవే; పేరు పేర్లు తలుపుతియ్యవే; పెద్దప్పదొరసానీ ! తలుపు

తియ్యావే" అని పిలిచింది. కాని తలుపుతియ్యలేదు. తలుపుగట్టిగాతీసి లోపలికెళ్ళి చూచింది. పిల్లలులేవు. అది యేడుస్తూ అడవిలోకి పోయింది. అక్కడికి పార్వతీపరమేశ్వర్లు భూమిని పాలించడానికని వచ్చారు. యేడ్చేబాతును చూచారు. "బాతుబాతు! ఎందుకేడుస్తున్నావే?" అని అడిగేరు. "మీరు ఆర్చేవారా? తీర్చేవారా? నాగోల మీకెందుకు? అంది. "ఆర్చేవారం మేమే తీర్చేవారం మేమే" చెప్పమన్నారు. పార్వతీపరమేశ్వరులు తన పిల్లలు పోయినసంగతి అంతా చెప్పింది. "వూరిబయట గుడిసెలో ఒక వేటకాడు ఉన్నాడు. వాడు నీ పిల్లల్ని తీసుకుపోయి చంపితినేశాడు. ఆ యెముకలు మాత్రం పెంటమీద పారేశాడు యీ అక్షంతలు నీళ్ళు తీసుకువెళ్ళి ఆ పెంటపోగుమీద చల్లితే బ్రతుకుతాయి" అని చెప్పి పార్వతీపరమేశ్వరులు మాయమయిపోయేరు. అప్పుడు తల్లిబాతు వేటకాడి యింటిదగ్గరకు వెళ్ళి అక్షంతలు నీళ్ళుచల్లి "రావే రావే గుమ్మాడీ! లేచిరావమ్మా రత్నాలగుమ్మాడీ! లేచిరావమ్మా, పేరు పేర్లు, లేచిరావమ్మా! పెద్దప్పదొరసానీ, లేచిరావమ్మా" అనిపిలిచింది. పిలిచేసరికి పెంటపోగులోనుంచి నాలుగుపిల్లలు గలగలమంటూ తల్లిదగ్గరానచ్చేయి. అన్నీ కలసి యింటికివెళ్ళేయి. కధ కంచికెళ్ళింది. మనం యింటికొచ్చాం.

---

# ఉపాధ్యాయ సాంఘిక సమస్య

(జూలై సంచిక తరువాయి)

ఉభయభాషాప్రవీణ - పండిత గుఱ్ఱప్పడియ ఆంజనేయులు P.O.L. గుఱ్ఱప్పడియ సత్యనారాయణమూర్తి
[సోదరకవులు - ఉపాధ్యాయులు]

గీ. ఈ విషయసాగరముఁ దరియింపఁగోర, మనయుపాధ్యాయసంఘోద్య-మంబె తరణి
ఘనులు చోదకుల్ విద్యాధి - కారవరులు, సముచితానిలరేఖ యుత్సాహశక్తి.

ఉ. ఒండొరులందుఁ గల్గు నపయుక్తములైన విభేదవల్లికల్
ఖండనసేసి యైక్యతను గాంచినచో నధికారధూర్వహుల్
మెండుగ గారవింతురు ఫలించును మానసభూమి మొల్కలై
యుండిన కోర్కెదీవెలు మహోదయ మయ్యది బోధకాళికిన్ ॥ 16

ఉ. గౌరవ మైనజీవనము గల్గెడుచోఁ దొలిరీతికన్న నెం
తే రహి విద్దెలన్ వటుల కేర్పడ నేర్పుదు రొజ్జ; లందునన్ .
వారికిఁ గల్గు వీరిపయి భక్తియు, రక్తియు; పౌరలోకమున్
జేరి భజించు దుస్థితిని జెందినచోఁ దమ దేశికోత్తమున్॥ 17

గీ. ఆ దినమె నిత్యమును మది యందు మనము, గనెడు కాంచనస్వప్నము కలయె, సత్య
మగుటయును గల్గు నొక్కచో - అట్టులైన నదియె పో! భారతోర్వి కల్యాణ వేళ॥ 18

*    *    *    *

సీ. చిన్నారిపాపని చిత్తంబులో దైవ, సృష్టిని జిత్రించు శిల్పివీవు
గంభీరభావముల్ కసుగందులకు నింపు, దవులు పల్కులఁ దెల్పుకవివి నీవు
ఎలకూన తొలికారు తలఁపుఁదీవెలఁ బెంచి, పూలనించెడు తోటమాలి వీవు
నిసువుశీలము సత్యనిత్యధర్మమునందు తాదాత్మ్య మొందించు తపసి వీవు
నిస్పృహత్వముతో న్యాయనిష్ఠ విడక, లుప్తభోగుండవౌ కుచేలుండవు నీవు
కావు సామాన్యములు నీదు గౌరవంబు, కార్యభారంబు; విస్మృతిఁ గనకు మిత్ర!॥19

మ. భువనారాధ్యము నీపదంబు; కవితాపుష్పాంగి నీకన్నె; వి
శ్వవిరాజాన్నవశక్తి నీ విడినభిక్షం బిస్సరో! కాలచ
క్రవిపర్యాసము! దైన్య మిట్లు గలిఁగెఁ గానిమ్ము లె మ్మాత్మగౌ
రవ రక్షాఘనదీక్షఁ గైకొనుము ధైర్యస్ఫూర్తిమై సోదరా!॥ 20

శా. భద్రంబేర్పడ సాంఘికోన్నతిని సంపాదించి, నీసాటివా
రద్రీంద్రప్రతిమానధైర్యులదె! హాసాలోకనప్రౌఢి న
క్షుద్రున్ గన్గొనుచుండి రక్కట! నినున్; జూడ్కిఁ బ్రసారించి, యీ
నిద్రాణత్వము నజ్జగింపు మిఁకనేనిఁ సోదరోత్తంసమా!॥ 21

మ॥ అదె లోకాతిగమై వినంబడెడు నుద్యత్తూర్యనాదోల్లన
స్మృదులంబై తొలిజాముపల్కగమి; కన్పించెన్ నవోజ్జీవనా
స్పదమౌ కావ్యమహోదయంబు, నయనద్వంద్వంబు వే విప్పి యీ
యదనున్ వమ్మొనరింప కందఁగదవయ్యా! వాంఛితార్థమ్ములన్॥ 22

ఉ॥ ఆతతసత్కృపానిరతులై యధికారులుగూడ నీకుఁ జే
యూఁత నొసంగుచుండిరి; నవోదితభావసమీరవీచికా
వ్రాతము వీచుచున్నయది; పానుపుడిగ్గి వికాసివై జగ
న్మాతను గొల్వ రమ్మిపుడు మాంద్యము నింద్యమునుమ్ము! నెచ్చెలీ॥ 23

సీ॥ ఆర్జింపు మిఁకనైన నలఘుశక్తి ఘటించు । సంఘసేవామహోత్సాహగరిమ
పఠియింపు మిఁకనైన భావప్రతిభఁ గూర్చు । కలితభాషాతత్త్వ కావ్యసమితి
నెలకొల్పు మిఁకనైన నలుగెలంకుల సర్వ । దంబులై తగు నుపాధ్యాయసభల
సాధింపు మిఁకనైన శాంతిమై రాజ్యాంగ । మందు నీకు లభించుహక్కు లెల్ల
ఇంచుకేనియు గమనింపు మింకనైన । అన్నిటికి మూలమైన నీ యాత్మబలము
పుట్టు వొందిన ఫలమును బొందె దీవు । గేయచారిత్ర యో యుపాధ్యాయమిత్ర!॥

సీ॥ అడుగంటి యున్న యీ యాంధ్రవాగ్దేవికిఁ । జేయఁ గల్గినసేవ సేయుఁడయ్య!
మన దేశగౌరవంబును పల్కులనెగాక । నిజవర్తనంబున నిలుపుఁడయ్య!
తార్చువృత్తికిఁ బెద్దతల్లియౌ ప్రైవేటు । రాకాసి పొంతకుఁ బోకుఁడయ్య!

ఆత్మవిద్యార్థుల కాదర్శకంబైన । మేటిశీలము గల్గి మెలఁగుఁడయ్య !
ఓర్పుతో నేఁటిదుస్థితి కొగ్గుఁడయ్య । కొలఁదిలో మేలు కలదని తలఁపుఁడయ్య !
ధైర్యమును బూనుఁడయ్య సద్భావులార । ధర్మరతులార యో యుపాధ్యాయులార !॥

మ॥ అకలంకం బగు రాజభక్తియు స్వధర్మాసక్తియున్ సంఘసే
వకసన్మైత్రియు, శిష్యవత్సలతయున్ భవ్యాంధ్రగీర్వాణభా
షాకళాకౌశల మేర్పడన్ గలిఁగి మాన్యత్వంబు పెంపొంద సా
ర్థకవాచ్యుల్ విజయంబుఁ గైకొనుఁ డుపాధ్యాయుల్ జగద్దేయులై ॥ 27

* * * *

సీ॥ మన భారతీయభూజనయిత్రి తొలివోలె । సిరుల కిల్లగుటఁ గాంక్షింతురేని,
హిందూమహాప్రజా సందోహమున నైక్య । భావ మేర్పడఁ గోరువారలేని,
సాంఘికం బగు దురాచార భూతచయంబు । నంత మొందింపఁగ నెంతురేని,
బాధ్యతాయుత విభుత్వము ప్రజాయత్తమై । నిలిచి మేలొనరింపఁ దలఁతురేని,
భువన సౌభాగ్యలక్ష్మికి భవనమైన । యట్టి ప్రారంభవిద్యకు నభ్యుదయము
గూర్చి మాతృఋణమును దీర్చికొనుఁడు మీరు । దేశనాయకులార ! సుధీశులార !॥

సీ॥ పల్లెలఁ బెనగొన్న పార్టీలఁ జక్కాడి । బడికిఁ గల్గు భయంపు వాపుటొకటి
బిడ్డల విద్యాభివృద్ధిపైఁ గన్నుంచి । యొజ్జకు సలహాల నొసఁగుటొకటి
ఉత్తమోపాధ్యాయు చిత్తంబు రంజిల్ల । వేళపట్టున గారవించు టొకటి
బలవంతమౌ బోధకుల యార్థిక క్లేశ । మపనయించెడు మార్గ మరయుటొకటి
నాలుగివి భారతీయుల మేలు కొఱకుఁ । బాటువడు మీకు విహితమౌ పరమవిధులు
చిత్తమునఁ జేర్చుఁ డిదియె నాచిన్నమనవి । దేశనాయకులార ! సుధీశులార !॥ 29

* * * *

సీ॥ దేశాభిమానులై మీశక్తి జనయిత్రి । సేవానిరూఢి వెచ్చింపరయ్య !
భాషాభిమానులై బహుమాన్యమై యొప్పు । తెలుఁగు గొప్పతనంబు నిలుపరయ్య !
సంఘాభిమానులై సమబుద్ధి నధ్యాప । కుల కున్నతిని గూర్పఁ దలఁపరయ్య !
శ్రేయోభిమానులై శీలప్రధానులౌ । పేదయొజ్జల గారవింపరయ్య !
నలుపు గనరాని మీ మేల్మినడతవలన । నిఖలదిశలను దెలికీర్తి నిలుపరయ్య !
ఇరుగడలఁ గల్గు లగ్గు మీకంతయేని । సారమతులార ! విద్యాధికారులార ! 29

సీ॥ కొఱగాని దుష్టుల కుటిలదంష్ట్రలఁ జిక్కి । యల్లాడుచున్నవి; పల్లెబడులు
ఆదాయమర్యాద లల్పమై కళవాసి । యున్నాఁడు; ధర్మియై యున్నగురుఁడు
మతివికాసము లేమి మాసోదరులలోన । సన్నమై యున్నది; సంఘశక్తి
క్రమశూన్యమై గౌరవము నామమాత్రమై । వ్యథ నొందుచున్నది ప్రథమవిద్య.
ఇట్టిదుస్థితిఁ బోకార్చి యెలమిఁ గూర్చి; । వాణి నర్చింపవలసిన వంతు మీది
విన్నపంబిదె సైపుఁ డో విబుధులార! । సారమతులార । విద్యాధికారులార! 30

* * * * * *

సీ॥ అన్యోఽన్యవైరంబు లడఁగి భారతభూమి । నెల్లెడ శాంతి భాసిల్లుఁగాత !
ఆగమాతిగ మైనయట్టి తొల్లిటివిద్దె । యెల్ల నాల్కల నుల్లసిల్లుఁగాత !
ఆహతప్రత్యూహమై యుపాధ్యాయౌఘ । మభ్యున్నతపదంబు నందుఁగాత !
గురుసత్తములపాలి కొంగుబంగారమై । వెలసి విద్యాశాఖ యలరుఁగాత !
అఖిలదేశనిచయ మందు వాసినిగన్న । యీమహాంధ్రసీసు నెల్లకడల
సుకవిరాజహృదయ వికచాబ్జపీఠిపై । దివ్యవాణి కొల్వుఁ దీర్చుఁగాత ! 31

---

# మావ్యాసకర్తలకు మనవి

మహాశయులారా !

1. గతమాసములోను, ఈ మాసములోను, వ్యాసములు విరివిగా వచ్చుటచే కొన్ని తప్పనిసరిగ ఆపుదలచేయఁబడినవి. అట్టివి వెనుకముందులంబట్టి వచ్చుసంచికలలోఁ బ్రకటింపఁబడఁగలవు. ఇందులకు వ్యాసకర్తలు మాపైఁ గినియక మా పత్రికయెడఁ బరిపూర్ణాదరాభిమానములఁజూపి తమ యత్యుత్తమ వ్యాసములను బంపుచుండ వలెనని మనవి.

2. వ్యాసకర్తలు తమచిరునామాలనువిడివిడి యక్షరములతో- పోష్టు జిల్లాతో సహా — వ్రాసి పంపుచుండవలెను. లేకున్న పత్రికలు చేరజాలవు.

3. వ్యాసకర్తలు ఈ క్రింది విషయములఁగూడ గమనించి వ్యాసములు వ్రాయవలెనని మనవి.

బాలవిజ్ఞానము (Cradle Songs - Action songs - Short stories etc) బాలనాటికలు - మాదిరిపాఠములు - Central class lessons or essays - ఉపాధ్యాయవృత్తి - బోధనాంశములు - బోధనాపద్ధతులు - ప్రాథమిక విద్యాభివృద్ధి కనువగు సూచనలు - పాఠ్యగ్రంథ విమర్శలు - పద్యకథలు - వృత్తివిద్యలు - వయోజన విద్య - మొదలగునవి

3. వ్యాసకర్తలుగాని, చందాదారులుగాని, తమకు పత్రికలు సకాలములో చేరని పక్షమున ప్రతినెల 25 వ తేదీలోగా ఏలూరు హెడ్డాఫీసుకు వ్రాసి తెప్పించుకొనవలెను. నాకు వ్రాయనక్కఱ లేదు.

5. వ్యాసకర్తలు తమ వ్యాసములను, ప్రతినెల 4 వ తేదికి నాకు చేరునట్లు సరాసరి సత్తెనపల్లికే పంపుచుండవలెను. ఆ తేది దాటివచ్చినది ఆ నెల సంచికలో వీలునుబట్టి ప్రకటింపఁబడును.

— సంపాదకుఁడు.

# ప్రపంచములోని ప్రసిద్ధనదుల తారతమ్య పట్టిక

తాతా జగన్నాథరావు - హెడ్మాష్టరు - బోర్డు ఎలిమెంటరీస్కూలు - శ్రీరంగం.

## ప్రపంచము

### ఉత్తరమెరికా
- యూకన్ (1800)
- సెయింటు లారెన్సు (2150 మైళ్లు)
- మెకంజీ (2300 మైళ్లు)
- మిస్సోరి మిసిసిపి (4350) మైళ్లు

### దక్షిణమెరికా
- సాన్ ఫ్రాన్సిస్కో (1400)
- మెడీరా (2000)
- లాప్లాట్ & పరానా (2300 మైళ్లు)
- అమెజాన్ (4000 మైళ్లు)

### ఆఫ్రికా
- జాంబెజీ (1800)
- నైగర్ (2600)
- కాంగో (2800)
- నైలు (3680)

### ఆసియా
- హ్వాంగ్ హో (2600)
- లీనా (2900)
- యాంకీ (3200)
- యాంగిట్సీకియాంగ్ (3475)

### ఐరోపా
- రైన్ (1120)
- డాన్ (1125)
- డాన్యూబ్ (1720)
- వోల్గా (సా॥ 2300)

### ఆస్ట్రేలియా
- ముర్రే 1500

# రుచులు - రంగులు

వంగర సూర్యనారాయణ.

ఆ. వె॥ ఆఱు రుచులనంగ - నాళతో నుందురు
వానివరుసవినుఁడు - వగరు; పులుపు;
మధువు; కారు; ముప్పా - మఱిచేదు; ఇవియెల్ల
పరమభాగ్యమండ్రు - వసుధజనులు.

*                *                *

ఆ. వె॥ ఒకటినలుపు; రెండు - ప్రకటింపనీలము;
పసుపుమూడు; ఆరు - పచ్చనాల్గు;
ఐదు తెలుపు; మఱియు - నాఱవది ఎఱుపు;
ప్రజలు వీని నాఱు - రంగులండ్రు.

*                *                *

---

# సివిక్సు - ప్రశ్నోత్తరములు

( ఐ ద వ త ర గ తి )

ఏప్రియలుసంచిక తరువాయి

(Copy-right to the authors)

By

తాతాజగన్నాధరావు హెడ్మాష్టరు. బోర్డుస్కూలు, కొంర్యాం.
వేదులఅన్నయ్యశాస్త్రి, హెడ్మాష్టరు. బోర్డుస్కూలు. గురమ్మపాలెం.

**12** యీదిగువ అహారపదార్థములయొక్క విలువను వర్ణించుము ? అన్నము, నెయ్యి, పంచదార, పప్పు, పాలు, మాంసము, పండ్లు, కాయగూరలు, ఆకుకూరలు, మిరియము, వాము.

జః— అన్నము, నెయ్యి, పంచదార, శరీరమునకు వేడిని, శక్తినియిచ్చును. పప్పు, పాలు, మాంసము శరీరముయొక్క కండరములను వృద్ధిచేయును. పండ్లు, కాయగూరలు ఆకుకూరలు శరీరాభివృద్ధికి వలయు విటమినులనిచ్చును.

మిరియము, వాము జీర్ణకారులు.

**12.** అంటువ్యాధులనేమి ? ఉదాహరణలిమ్ము ?

జః— కొన్నివ్యాధులవలన పీడింపబడు రోగులశరీరమునుండి సూక్ష్మజీవులు బయల్వెడలి అనేకవిధములుగా ఇతరుల శరీరమునందు ప్రవేశించి వ్యాధులను వ్యాపింపచేయుచున్నవి అట్టివానికే అంటువ్యాధులనిపేరు.

గజ్జి, తామర, చుండ్రు, కండ్లకలక, వేపపువ్వు, ఆటలమ్మ, మసూచి, విషూచి, సన్నిపాతజ్వరము, మన్యపుజ్వరము, మహామ్మారి, క్షయ మొదలగునవి అంటువ్యాధులు.

14. సూక్ష్మజీవులనగానేమి ? అవిఎట్లువ్యాపించును ?

జ:— సూక్ష్మజీవులనగా కంటికి కనుపించకుండనుండి, యంత్రసహాయమున మాత్రమే కనిపెట్టగల్గిన అణులవంటి ప్రాణులు. ఇవి స్పర్శమువల్లను, గాలిద్వారాను, కొన్నినీరు, ఆహారముల మూలముగను, కొన్ని రక్తపానీయములగు పేలు, నల్లులు, ఈగలు, దోమలు, మిణ్ణలులవలనను వ్యాపించుచున్నవి.

15. యీదిగువవ్యాధులు ఎట్లు వ్యాపించును ?

1. గజ్జి, 2. కలక, 3. కలరా, 4. మశూచికము. 5. క్షయ.

జ:— 1 గజ్జి:- ఇది చర్మసంబంధమగురోగము. ఇట్టిరోగులను తాకుటవలనను, వారుధరించిన వస్త్రములు, వాడినవస్తువులను తాకుటవలనను వ్యాపించును.

2. కండ్లకలక:- రోగికండ్లమీదనుండివచ్చు గాలి సోకుటచే వ్యాపించును.

3. కలరా:— యీరోగులు విడుచు మలమూత్రములను జలాశయముల సమీపమందు పారవేయుటచేతను, రోగుల వస్త్రములను నీటియందు ఉతుకుటవలనను సూక్ష్మజీవులు నీటిలో ప్రవేశించును అట్టినీటిని త్రాగినందున రోగము వ్యాపించును. యీ రోగుల మలమూత్రములపై వ్రాలిన ఈగలు మన ఆహారపదార్థములపై వ్రాలుటచేతను యీ రోగము వ్యాపించును.

4 మశూచికము:—యీవ్యాధి స్పర్శమువలనను, గాలివల్లనుకూడా వ్యాపించును.

5. క్షయ:—యీవ్యాధి గాలివలనను, క్షయవ్యాధిచే బాధపడెడు ఆవుయొక్క మాంసమును గాని, పాలనుగాని సేవించుట వల్లను వ్యాప్తి చెందును

16. అంటు వ్యాధులను నిర్మూలము చేయుటెట్లు ?

జ: అంటురోగులను ప్రత్యేకస్థలముల యందుంచుట. వారినుండి రాకపోకలు లేకుండా చేయుట, వారుండు స్థలములను వదలుట, అంటువ్యాధులను గురించి ఆరోగ్యశాఖవారికి తెలియపరచుట, వ్యాధిబీజములను మందువలన నిర్మూలముచేయుట, టీకాలను వేయించుట, సూదిమందుల నిప్పించుట మొదలగు పద్ధతుల నవలంబించుట వలన అంటువ్యాధులను నిర్మూలము చేయవచ్చును

17. ఈ దిగువపదార్థములు అంటువ్యాధుల విషయములలో ఎట్లుపయోగపడును ?

1. నైట్రిక్ ఏసిడ్డు 2 ఫినైలు 3 పొటాషియంపర్మాంగనేటు

జ: 1. నైట్రిక్ ఏసిడ్డు:—యీమందుగా రాగిరేకు వేసినచో వచ్చు వాయుపదార్థమును రోగులుండు గదులయందు నింపుటవలన వ్యాధిబీజములు నశించును.

2. ఫినైలు:—దీనిని కలిపిన నీట్టిని రోగులుండు గదులయందు, సామానులమీద చిల్లుటవలనను మలమూత్రములు విడిచిన స్థలములందును,జలదారులును డిగినందువసూక్ష్మజీవులు నశించును.

3. పొటాషియం పెర్మాంగనేటు:—కలరా బయలుదేరిన స్థలములలోని ప్రజలు వాడు జలాశయములలో దీనిని కలిపి శుద్ధిచేసెదరు అందువలన నీరు శుద్ధిపడును క్షయరోగులు యీమందు కలిసిన నీటిలో ఉమ్మివేయుటవలన ఆ రోగబీజములు వ్యాపింపవు.

Syllabus Heading—The use of drugs such as Tobacco, opium, ganja, alcoholic drinks, their effects on health etc.

1. మత్తుపదార్థము లనగేమి ?

జ: సేవించుటలో మత్తును గలుగజేయు వాటికి మత్తుపదార్థములని పేరు. పొగాకు, గంజాయి, నల్లమందు, కల్లు, సారాయి, కాఫీ తేయాకు మొదలగునవి మత్తుపదార్థములు.

2. మత్తుపదారమువలన గల్గు అపకారములను సూచింపుము ?

జ: వీనిని ఉపయోగించు వారు వదలలేకపోవుట; ఎక్కువగా ఉపయోగించవలెనను బుద్ధికలుగుట, ధనవ్యయమగుట, ధనము లేనిచో దొంగిలించవలెనను బుద్ధిపుట్టుట, మర్యాద పోగొట్టుకొనుట, నీతితప్పి తిరుగుట, ఆరోగ్యము చెడుట, మృత్యువాసన్నమగుట మొదలగు నష్టములు గలవు

3. మద్యపాననిషేధము, పొగాకు, గంజాయి మొదలగువానిని గూర్చి గవర్నమెంటువారెట్టి చర్యలు గైకొనుచున్నారు ?

జ: గవర్నమెంటువారు మధుపానము, పొగాకు, గంజాయి మొదలగు వానిని నిషేధింపు తలంపుతో కొన్ని చట్టముల నేర్పాటుచేసియు, నల్లమందు, గంజాయి అమ్ముటకు లైసెన్సుల నిచ్చియు ప్రజల ఆరోగ్యమును కాపాడు చున్నారు.

Syllabus Heading:—What the Government stands for and what it does for us, why and how we should co-operate with government, various departments of government

1. గవర్నమెంటు అనగా నేమి ?

జ: ప్రజలయొద్ద పన్నులను తీసుకొని ప్రజలక్షేమమును, వారియాస్తులయొక్క క్షేమమును కాపాడుచు, సౌఖ్యకరముగను, శాంతికరముగను జీవనము చేయుటకు తగిన సదుపాయములను ఏర్పరచు సంస్థకు గవర్నమెంటు అని పేరు.

2. గవర్నమెంటువారు చేయు మేళ్లను వివరింపుము ?

జ: మన పొలములను సేద్యముచేసి పంటలను పండించుటకు తగిన సదుపాయములను ఏర్పరుచుట, రాకపోకలకు వర్తకవ్యాపారములకు తగిన సదుపాయములను యేర్పరచుట, ఆరోగ్యశాఖల నేర్పరచి ప్రజల ఆరోగ్యమును కాపాడుట, రక్షకభటశాఖ నేర్పాటుచేసి ప్రజల ఆస్తులను, ప్రాణములను కాపాడుట, మొదలగు ఉపకారములు గవర్నమెంటువారివలన మనకు కల్గుచున్నవి.

3. మనము గవర్నమెంటువారితో సహాకారమెట్లు చూపవలెను ?

జ: మనకు మేళ్లు కలిగజేయుటకై కొంతధనము వ్యయపరచవలెను అందుకనే మనవద్ద పన్నులను తీసుకొనుచున్నారు అట్టి పన్నులను మనము యివ్వము అని నిరాకరించకూడదు. మనక్షేమమునకై కొన్ని చట్టములను యేర్పరచుచున్నారు. అట్టి చట్టములను కూడా నిరాకరించరాదు. చట్టములను ఆచరణలో పెట్టుటయందును, పన్నులు వసూలుచేయుటయందుము, దేశమునందు శాంతి నెలకొల్పుటయందును మనము దొరతనమువారికి సహాయము చేయవలెను.

---

# సత్తెనపల్లితాలూకా ప్రాథమికోపాధ్యాయ సంఘ తృతీయ వార్షికోత్సవము (1941-1942)

ది 19-20 జూన్ తేదీలలో సత్తెనపల్లితాలూకా ప్రాథమికోపాధ్యాయ సంఘ తృతీయవార్షికోత్సవము సత్తెనపల్లి శ్రీ శరభయ్య గుప్తాగారి హైయండ్ వోర్నకపాఠశాలయందు స్థానికసబ్ మేజస్ట్రేటు శ్రీ సి. సాంబయ్యపంతులుగారి యాజమాన్యము క్రింద ప్రారంభింపబడెను.

పేదల శ్రేయోభిలాషియగు శ్రీ సి. సాంబయ్యపంతులుగారు దైవప్రార్థనతో ప్రారంభింపబడిన సమావేశములో "భారతరామాయణ కాలమునాటి గురువులకు గల గౌరవాభిమానములు నేటి గురువులనబడు ఉపాధ్యాయులయెడజూపబడకపోవుట మిగుల విచారకరమనియు ప్రస్తుతోపాధ్యాయులు విద్యావిశాలరరిగమున ప్రధానస్థాన మలంకరించుట సమంజసమనియు తన ప్రారంభోపాన్యాసమున నుడివిరి.

అగ్రికల్చరల్ డెమానుస్ట్రేటరు శ్రీ జి. సీతారామశాస్త్రిగారుప్రాథమికోపాధ్యాయ "పాఠశాల తోట పని" అను అంశముపై చక్కని యుపన్యాస మొసంగుచు, యుద్ధకాలములో తిండిగుడుపుల కనుగుణ్యమగు పైరుల నభివృద్ధిచేయు రైతుగణమును ఉపాధ్యాయుడు ప్రోత్సాహించవలయునని నొక్కిచెప్పిరి.

ఆయాపాఠశాలలలోతయారుచేయబడి, ప్రదర్శనారనాలయమున కూర్చబడిన వస్తువులను శ్రీ హైయండవోర్నతో పాఠశాల హెడ్మాస్టరు. ఎమ్. ఎల్. సుబ్బయ్యశెట్టిగారు బహిరంగపరచి, వస్తుప్రదర్శనమును విద్యార్థుల విద్యాభివృద్ధికి అనుగుణ్యముగను ప్రయోగించుట ముఖ్యమని సెలవొసిచ్చిరి.

మరునాటి ఉదయపు సమావేశములో ఈక్రింది ప్రతిపాదనలు ఎల్లరును ఏకగ్రీవముగా నంగీకరించిరి.

1. a ప్రస్తుత కరవు పరిస్థితులలో బోర్డు పాఠశాలలకు ఇచ్చుచుండిన కంటింజెన్సు వృద్ధిచేయించుటకున్ను, (b) వార్ ఎలవెన్సు యిప్పించుటకున్ను, c, పాఠశాలలకు వలయు రికార్డు పుస్తకములన్నియు సప్లయి చేయించుటకున్ను, d, పాఠ్య గ్రంధములు ప్రతిపాఠశాలలకు సప్లయి చేయించుటకున్ను, శ్రీ సత్తెనపల్లి రేంజి స్కూల్సు డిప్యూటి ఇన్‌స్పెక్టరువారిద్వారా శ్రీ జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారిని ప్రార్థించుట యైనది.

2. ప్రస్తుత విద్యావిధానములో ఉపాధ్యాయులకు పిల్లలను పోగుచేయుటయు, చదువు చెప్పుటయు నను రెండు బాధ్యతలను మోపియున్నారు అవి రెండును నిర్వహించుట కష్టసాధ్యముగాన ఉపాధ్యాయునకు చదువుచెప్పు బాధ్యతను మాత్రమే ఉంచవలయునని ప్రభుత్వమును యీ సభవారు కోరుచున్నారు.

యుద్ధకాలమగుటచే వస్తుకరువును, అధికధరలును అగుటచే, యిదివరకు ప్రభుత్వమువారు యిచ్చు ఆర్థిక సహాయక మాస గ్రాంటుకు ఇంకొక్క రూపాయ కలిపి యియ్యవలయు ననెడి ప్రతిపాదన ఏకగ్రీవముగా అంగీకరించి తీర్మానించడమైనది.

అనంతరము రాబోవు వత్సరపు కార్య నిర్వాహక వర్గ మెన్నుకొనబడెను.

20-5-42 మధ్యాహ్నము ఎయిడెడ్ ఉపాధ్యాయ సంఘాలలో, ఉపాధ్యాయ మేనేజర్లను గూడ కలిపివేయుటవల్ల ఆ సంఘము సక్రమముగా పని జరిగించుటకు అవకాశము లేక స్తంభించిపోయినది గాబట్టి ఉపాధ్యాయ సంఘములను ఉపాధ్యాయ మేనేజర్లను వేరుజేయవలయునని తీర్మానించడమైనది. శ్రీ పుచ్చా లక్ష్మీనారాయణగారి యాజమాన్యము క్రింద తిరిగి సమావేశమైనది. నేషనల్ వార్ ఫ్రంటు జిల్లా ఆర్గనైజరు, శ్రీ టి. యస్, పాలెస్‌గారు, రాని కారణమున, అధ్యక్షులే "యుద్ధము - ఉపాధ్యాయుని కర్తవ్యము" అను విషయమును గూర్చి విపులపరచిరి. గ్రామాదులలో పామర జనాళిని శత్రుప్రపంచమ దళ ప్రచారకులు భీతిగొలుపుచుందురనియు అట్టి ఎడ నిజవార్త తెలిగించి, గ్రామాదులలో నెమ్మదిని నెలకొల్పుట ఉపాధ్యాయుల ముఖ్య కర్తవ్యమనియు నుడివిరి.

అంతట ఎగ్జిబిషన్ కమ్మిటి అధ్యక్షులగు శ్రీ మెడికల్ ఆఫీసరు కె. కృష్ణమూర్తినాయుడుగారును విద్యాపరీక్షాధికారులును. పోస్టు మాస్టరుగారును హిందూ హైస్కూలు హెడ్మాస్టరుగారును, ప్రదర్శనార్థమై గొనితేబడిన వస్తునైపుణ్య నిర్మాణమునకుగాను తగిన యోగ్యతా పత్రము లిచ్చుటకు తీర్మానించిరి.

చివరగా కార్యదర్శిగారి అభివందనములతో మా సభ ముగిసెను. మాసభ స్థిరముగా నెలకొల్పబడి వర్షమున కొకతీరున విరాజిల్లుచు, విద్యాలోకమున కెక్కుడు సహాయకారి కాగలందులకు శ్రీ భగవంతుని ఎల్లరుచు ప్రార్థింప మిక్కిలిగా గోరుచున్నాను.

బుధజనవిధేయుడు
యం. రత్నము.
కార్యదర్శి.

---

# పోషకుల సమావేశము

కృష్ణాజిల్లా గన్నవరముతాలూకా ఆత్కూరుబోర్డు బాలుర ఉన్నత ప్రాథమిక పాఠశాల తల్లిదండ్రులసభ ది 20-7-42 తేదీన జరుపబడెను. అందు 8 వ తరగతి గవర్నమెంటు పరీక్షకు పంపబడిన అయిదుగురు విద్యార్థులు పరీక్షయందు జయమును పొందిరి. వారి సర్టిఫికెట్సు సభలో యొసగబడెను.

గోరంట్ల ప్రసాదరావు

# వరహా పురము

29-7-42 వ తేదీని ఈ గ్రామరీడింగు సర్కిలు సమావేశ సందర్భమున పేరెంట్సు సంఘ సమావేశముకూడ జరుపబడెను. చాలమంది హాజరైరి ప్రాథమిక విద్యోపయోగము గూర్చి సభ్యులు బోధించి తమపిల్లలను బడికిపంపుటలో శ్రద్ధవహించవలెనని ఉపన్యసించిరి ఈ గ్రామపాఠశాలలో నొక రగు శ్రీ దూర్వాసుల శ్రీరామశాస్త్రిగారు ఈపాఠశాలాభివృద్ధికి తోడ్పడుదుమని వాగ్దానమొసంగిరి. వారు పౌరులను ఇదివరకే ప్రోత్సహించుచున్నారు. ఇందుకెల్లరు సంతోషము జూపుచు సాయంకాలము 6 గం|| కు సభ ముగించిరి.

ప. శ్రీరామమూర్తి
కార్యదర్శి

---

# టీచర్సు ఆసోసియేషను - అముజూరు.

(రామచంద్రపురము తాలూకా)

ది 27-6-1942 తేదీ ఉదయము 7 గంటలకు అముజూరు కేంద్రోపాధ్యాయ సంఘసభ, శ్రీనిడసనమెట్ల సూర్యారావుగారు (హెడ్మాష్టరు, బోర్డు ఎలిమెంటరీస్కూలు, ఉేకి) అధ్యక్షత వహింప సమావేశమైనది. సుమారు 50 మంది ఉపాధ్యాయులు మరి యితరపుర ప్రముఖులు సభకేతెంచిరి.

అందులో అముజూరు బోర్డుస్కూలునకు ప్రధానోపాధ్యాయులుగను సదరు సెంటరుకు సెక్రటరీగనుయుండి, తోడి యుపాధ్యాయులందరి యొక్క ఆదరాభిమానములను చూరగొని, తమ సహజశక్తులన్నియు విద్యోద్ధరణమునందే నిమగ్నులగావించి ప్రాథమిక విద్యావ్యాప్తికి బహువిధముల నపారసేవ చేసిన శ్రీ కోరుకొండ మంగయ్యగారు ఉద్యోగమునుండి విరమించుచున్నందున సదరుపాధ్యాయ బృందము శ్రీ మంగయ్యగారి గౌరవార్థమై తేనీటి విందొసంగెను.

శ్రీ మంగయ్యగారియొక్క నిరాడంబర జీవనము, విద్యాబోధన, దయా సత్యశౌచ, సర్వజన సమత్వములను గురించి బహుభంగుల శ్రీ యుతులు శృంగారకవి లింగరాజు, గోవిందవఝుల రామమూర్తి, వింజమూరి లక్ష్మణమూర్తి, గోవిందరాజుల కృష్ణమూర్తి, యస్. మంగరాజు, వి యస్. శాస్త్రి గారలుపన్యసించిరి.

అనంతరమున సదరు పాఠశాలకు ప్రస్తుత ప్రధానోపాధ్యాయులుగ నుండిన శ్రీ చిగురుపాటి వీరన్నగారిని అముజూరు కేంద్రోపాధ్యాయ సంఘమునకు కార్యదర్శిగా సభ్యులందరి యామోదముతోను ఏక గ్రీవముగా ఎన్నుకోవడమయినది— శ్రీ. శ్రీ. శ్రీ.

ఇట్లు,
వేదుల సూర్యనారాయణ శాస్త్రి.
బోర్డుస్కూలు టీచరు.

సత్యవాడ,
20—6—42.

---

# న గ రూ రు

తా॥ 29-7-42 న స్థానిక పాఠశాలా భవనమున మన రేంజి స్కూల్స్ ఇన్‌స్పెక్టర్ గారగు శ్రీయుత ఏ. శాంతవీరప్పగారు బి. ఏ. బి. ఇడి., వారి యాజమాన్యమున తల్లిదండ్రుల సమావేశము విజృంభణముగా జరిగినది. అధ్యక్షులు ప్రస్తుత

రాజకీయ విషయములను స్వారస్యముగా విశదీకరించిరి. తదుపరి గ్రామ హిందూపాఠశాలాభివృద్ధికి సకారణాత్మక లోపాలోపములను విపులముగా చర్చించిరి. వందనములతో సమావేశము ముగిసెను.

హెచ్. హంపంణ.
హెడ్‌మాస్టర్.

---

## బందరు డీనరీ ఛేర్మెన్‌గారి ట్రాన్సుఫరు సందర్భమున K. C. C. C. డీనరీ ఛేర్మెనుల సమావేశము

బందరు డీనరీ చైర్‌మన్ గారగు శ్రీ రివరెండు కానన్ వై. ముత్యాలుగారిని కృష్ణా సెంట్రల్ చెర్చి కౌన్సిలు (బెజవాడ) కు జాయంటు ట్రెజరర్‌గా నియమించిన సందర్భమున, బెజవాడలో C. M. S. మిషన్ కాంపౌండులో ది 29-7-42 తేదీ సాయంత్రము 7-30 గం॥ లకు శ్రీ లార్డు బిషప్ ఆఫ్ డోర్నకల్ వారి యాజమాన్యమున K. C. C. C. డీనరీ చైర్‌మన్ లందరు సమావేశమై, శ్రీ ముత్యాలుగార్ని అభినందించిరి.

ఈ చెర్చిమిషన్ సంఘపు ఉద్యోగములో ప్రవేశించిన తదాదిగ శ్రీ కేనన్ ముత్యాలుగారు బాధ్యతావహమైన అనేక పదవులు స్వీకరించి, సదరు పదవులకు సంబంధించిన కార్యక్రమము అతి సమర్థతతో నెరవేర్చిరి. ఈ విషయమును గ్రహించి ప్రస్తుత జాయంటు ట్రెజరరీ పదవికి శ్రీ ముత్యాలుగారు తగువారని ఆమోదించి, వీర్ని సదరు పదవికి నియమించినందుకు శ్రీ లార్డు బిషప్ ఆఫ్ డోర్నకల్ వారికిని ది వెనరబుల్ ఆర్చి డెకన్ E N. స్పియర్ దొరవారికిని మా కృతజ్ఞతాభివందనములు.

అన్ని పదవులు స్వీకరించి అందుగల యనుభవముతో సాధక బాధకములను గుర్తించి, డీనరీలలో మత, అధికార, ఆర్థిక విషయములలో మాకు సహాకారమీయగలందులకు శ్రీ ముత్యాలుగార్ని కోరుచున్నాము. ఈపదవి శుభప్రదముగను, నిర్విఘ్నముగను, కొనసాగించుటకు శ్రీ ముత్యాలుగారికి శక్తి, ఆయురారోగ్యములు భగవంతుడిచ్చుగాక.

ఈ సభకు హాజరయి సభను నిర్విఘ్నముగ కొనసాగించిన ది వెనరబుల్ ఆర్చిడెకన్ E. N. స్పియర్ దొరగారు వారిసతీమణి Miss E. N. స్పియర్‌గార్కి Miss. M. బ్రదర్‌టన్ దొరసానిగార్కి కెనన్ పటిల్‌వర్తు దొరగార్కి హాజరయిన తదితర C. M. S. యుద్యోగీయులకును మా అభివందనములు.

ఇట్లు,
K. C. C. C. ఏరియా డీనరీ చైర్‌మెన్.

---

# సోవియట్‌లో విద్య

## శ్రీ ఓ. లియోనావా వ్రాసిన గ్రంథమునకు అనువాదము.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య.

టాల్‌స్టాయి, చెకోల్, గోర్కీ మున్నగు ప్రసిద్ధరచయితలు తమ నవలలోను, యితర రచనలలోను జారులరష్యాలోని వీధి బడి పంతుళ్లు ప్రజలకు విద్యనేర్పుటకై ఎంతగ కష్టపడిరో చిత్రించియున్నారు. బాధలతోను,పీడనలతోను వారుగడపిన జీవితాలు ప్రపంచానికిక్రొత్తగాదు. అంతాదుర్భరమే.

గొర్రెతోకవలె జీతమును బడసియు జారులరష్యాలోని గ్రామోపాధ్యాయుడు స్థానిక అధికారులచేత, 'బ్లాక్‌హండ్రడ్స్' సభ్యులచేత, భూస్వాములచేత, దుకాణదారులచేత, నిరంతరం బాధలకు లోనై హతమార్చబడిరి. ఆనాడు పల్లెసీమలోకి పోతే, చెప్పతగ్గ పారశాలభవనమే కాన్పించదు. పడిపోయిన గోడలతో, రాలిపోయిన కప్పుతో ఊరిబయట ఏ మూలనో పారశాలా అంటూ ఒకటి ఉండేది. అదీ అన్నిగ్రామాల్లో అనుకోకండి. చుట్టుప్రక్కల అయిదారుమైళ్లకు అదొక్కటే పారశాల. చినిగిన పేలికలతో, జానెడులోతుకుపోయిన కడుపుతో, లోపలికి పీక్కుపోయినకండ్లతో, సగంమాడిన కడుపుతో, ఎముకలప్రోగులుగానున్న కుర్రవాండ్రు, బురదడొంకలలో, జోరువానలో వళ్లు పీక్కుతినే కారుచలిలో, కాళ్లు సగం కొరొక్కుపోయే మంచులో, చలికాలంలోను రైతుబిడ్డలు యీడ్చుకుంటూ యేడ్చుకుంటూపోవాలిసిందే. ఈవిధంగా చదువగలిగిన 'అదృష్టవంతులు' ఎందరుంటారు నూటికి, వేయికి ఏ ఒకరో యిద్దరో!

జారులరష్యాలో జానాభాలో (తొమ్మిది సంవత్సరాల పసిపిల్లలను మినహాయిస్తే నూటికి73మంది అక్షరజ్ఞానమెఱుగనివారే. వెయ్యిమంది జనసంఖ్యలో పారశాలకు వెళ్లేవారిసంఖ్య 50 మందికూడాలేదు. అసలు జనాభాలో బడికిపోతగిన ప్రాయంలోని బిడ్డలు నూటికి 22 మంది ఉన్నా బడికిపోయేవారు నూటికి 407 అంటే 1000 మందికి 47 మంది అన్నమాట.

జారుల పాలనలోని రష్యాలో విద్యావ్యయము 1913 లో 136,700,000 రూబుల్సుకు నిర్ణయించబడింది. అంటే సగటు దేశంలోని తలకు 80కోపిక్కులన్నమాట. ఇదే యింగ్లాండులో 3 రుబుల్సు, బెల్జియంలో 3½, అమెరికాలో దాదాపు 9 రూబుల్సు ఖర్చుచేస్తున్నారు (రూబులుకు 100 కోపెక్కులు).

అనేకబాధలకు లోనైగూడ విద్యాజ్ఞానాన్నిబడసి పైకివచ్చినవారు చాలా అరుదు. శాస్త్రజ్ఞుడగు మైకేల్ లోమెనోసోవ్, ఉక్రేనియన్‌కలి టారాస్‌షెన్‌కో, రచయిత మాక్సింగోర్కీ బోటివారుప్రజాసామాన్యంనుండివచ్చి రష్యాయొక్కయే గాకుండాప్రపంచనాగరికతను సంపన్నం చేసిన వారిబోటివారు చాలకొలదిమందే!

ప్రపంచ యుద్ధసమయంలో ప్రజా

సామాన్యంయొక్క విద్య మరీ అధ్వాన్నం అయిపోయింది. దేశంయొక్క ఆర్థికపతనం ప్రజలబీదరికంవల్ల పాఠశాలకు వెళ్లే వారి సంఖ్య మరీ పూర్తిగా తగ్గిపోయింది. అనేకస్థలాలలో పాఠశాలలుకూడ మూసివేయబడినవంటే క్రొత్తవి ప్రారంభించడం యింకెక్కడిది.

విప్లవానంతరం మొదటి సంవత్సరంలో దేశంలోని విప్లవ ఘాతకులతోడను, పరదేశీయులుజోక్యంకల్పించుకొనవచ్చినవారితోడను తీవ్రమైన, కఠినమైన పోరాటంలో సోవియట్‌రష్యా నిమగ్నం కావలసి వచ్చింది. అయినప్పటికిని అట్టికష్టకాలంలో గూడసోవియట్‌ప్రభుత్వం ప్రజాసామాన్య విద్యపై తమదృష్టిని పూర్తిగా కేంద్రీకరించిది. మంచిమంచి భవనాలనన్నిటిని, పాఠశాలలు, శిశుక్రీడామందిరాలు, మాతృశాలలు కొరకు స్వాధీనపరచుకొనుచు డిక్రీలు అమలుసాగించిరి. గుట్టలు గుట్టలుగ పూర్వపుపద్ధతిలో పడియుండే బిడ్డలనందరను గాలివెలుతురుగలిగి, గదులు గదులుగనమర్చిన భవనాలలోనికిమార్చిరి. పాఠశాలలకు హాజరయ్యే సంఖ్యకూడా పెరిగింది.

1917 అక్టోబరు విప్లవంజాతుల నిర్బంధాన్ని అరికట్టి విద్యాసౌకర్యాలలో యిదివరకు ఆయాజాతులవారికిగల అడ్డంకులను గూడ తుడిచి పారవేసెను. నూటికి యింతమందికన్నా యీ జాతివారు ఎక్కువ చేర్చుకొనబడకూడదు అనే నిషేధాన్ని, ముఖ్యంగా యూదులపై జారులచే నమలు జేయబడుచున్న నిషేధాన్ని తొలగించి హైస్కూళ్లలోను, కళాశాలలలోను చేర్చుకొనిరి. ఉక్రేనియా, జార్జియా, ఆర్మేనియా, అజేర్‌బైజాన్, బైలోరష్యా, మధ్యఆసియాలలో జాతీయపాఠశాలలు స్థాపించకూడదనే నిషేధాన్ని కూడా తొలగించిరి. సోవియట్ దేశములోని అందరు బిడ్డలకును వారి మాతృభాషలో చదువుకొనుటకు అవకాశం యివ్వబడెను.

పెద్ద ఎత్తున దేశమంతటి వయోజన నిరక్షరాస్యతా నిర్మూలనోద్యమం అమోఘంగా కృషిచేయబడెను. లి యె నా వా (యీవ్యాసాన్ని యింగ్లీషులో వ్రాసినతను.) 1918 లో వయోజనుల పాఠశాలలలోను బిడ్డల పాఠశాలలలోను పనిచేసెను. ప్రజలు తమ 30-40 సంవత్సరాల ప్రాయంలో మొట్టమొదటిగా చదువను వ్రాయను నేర్చినపుడు వారుపొందిన ఆనందాన్ని జ్ఞాపకం చేసుకుంటే వారి విద్యాకాంక్ష ఎంతో మరువజాలను. నేడు ముఖ్యంగా అనక్షరాస్యత పూర్తిగా నిర్మూలించబడింది. 20 సంవత్సరాల సోవియట్ పాలనలో 40000000 మందికి చదువను, వ్రాయను నేర్పారు.

అంతర్యుద్ధం తరువాత ప్రజావిద్యపై సోవియట్ ప్రభుత్వం యింకాఎంతో శ్రద్ధ తీసుకొన్నది. వివిధజాతుల ప్రజల (మనమాదిరే) గల సోవియట్ల దేశంలో అనేక కష్టాలను ఎదుర్కొన వలసివచ్చింది. రష్యా దేశంలోని కొన్నిజాతులలోని కొన్ని భాషలకు అసలు లిపియేలేదు. పాఠశాలలు లేవు ఉపాధ్యాయులు లేరు. అందుచే విద్యావిధానంలో లిపి కనిపెట్టడంనుండి ప్రారంభించ వలసివచ్చెను.

జారులపాలనలో సార్వజనీనక ప్రాథమిక విద్య తలంపనేలేదు. జారుల మంత్రులు సార్వజనీనక ప్రాథమిక నిర్బంధవిద్య "ఇరు

పదవశతాబ్దాంతంలోగా ప్రారంభించ వీలు లేదన్నారు." పాపం! వారి విధానమే అంతకన్న త్వరగ అంతమైపోయింది. త్వర త్వరగా సాగిపోతూన్న దేశంలోని, ఆర్థిక వైజ్ఞానికాభివృద్ధి, జనులకు భౌతిక సుస్థిరత, విజ్ఞానశాఖలో సోవియట్ ప్రభుత్వం గావించినకృషి 1931 లోని కల్లా సోవియట్ యూనియన్‌లో సార్వజనీనక ప్రాథమిక నిర్బంధ విద్యావిధానం అమలుపర్చ వీలయింది.

పాఠశాలలలోని బిడ్డల, విద్యార్థుల సంఖ్యను ప్రజా విద్యాలయాలకు, పాఠశాలా నిర్మాణానికి వెచ్చించిన లెక్కను బట్టి సోవియట్ యూనియన్‌లో ప్రజా విద్యాభివృద్ధి ఎంత అభివృద్ధి అయిందో ఎవరయినా నిర్ణయించవచ్చు. 1914 లో చదువుతుండే శిశువులుగాని, విద్యార్థులు గాని, 8,13,7000 మంది మాత్రమే అన్ని రకముల విద్యాబోధనలోని శిశువులను, విద్యార్థులను కలిపితే 1938-39 లలో 47,442,200 మందిగలరు.

1914 లో హైస్కూళ్ళకు హాజరైన సంఖ్య 9,95,000 మంది. 1938-39 లో హైస్కూళ్ళు (ప్రత్యేక పాఠశాలలు, సాధారణ పాఠశాలలు) లోను హాజరైన వారి సంఖ్య 12,076,000 మంది.

1914 లో విశ్వవిద్యాలయాలలోను, కళాశాలలోను 1,120,000 మంది విద్యార్థులుకలరు. 1938-39 లో 6,01,000 మంది కలరు.

జారులపాలనలో 200 సంవత్సరాలలో నిర్మింపబడిన వానికన్న సోవియట్‌పాలనలో ఎన్నోరెట్లు ఎక్కువ పాఠశాలలు యింతవరకు నిర్మింపబడినవి. 1933 నుండి 38 వరకు 20,607 పాఠశాలలు నిర్మింపబడెను.

సోవియట్ యూనియన్లు విద్యాబోధ (tution) ఉచితంగా యివ్వబడును. అంతే గాక అధిక సంఖ్యాకులగు విద్యార్థులకు, కళాశాలా విశ్వవిద్యాలయ విద్యార్థులకును విద్యార్థి వేతనము, ఉండడానికి వసతి గృహాలు, మరియు అవసరమగు యితర సహాయాలు యివ్వడంతో విద్యార్థులను సోవియట్ ప్రభుత్వం ఎంతో ప్రోత్సాహిస్తుంది.

పౌరవిద్యపై ఖర్చు దినదినాభివృద్ధి నొందుచున్నది. ఒక్క 1937 సం॥ లో మాత్రమే 6,170,000 రూబులులు పాఠశాలలకు కావలసిన పరికరాలకై వినియోగించబడెను.

పదిరకములకు విద్యాసంస్థలలోనికి విద్యార్థులు అధిక సంఖ్యాకులుగ వచ్చుటకు అనువగు ఏర్పాటులతో బాటు నగరములలో సార్వజనీనక నిర్బంధ యున్నత విద్యయును, గ్రామసీమలలోను, జాతీయ ప్రజాస్వామికాలలోను, సార్వజనీనక నిర్బంధ ప్రాథమికవిద్య (ఏడవతరగతి వరకును) అమలు జరుపుటకు తృతీయ పంచవర్ష ప్రణాళిక (1938-42) లో ఏర్పాటు చేయబడెను.

ఈ ప్రణాళికలో 1938-39 లోని 601000 నుండి 1942 నాటికి కళాశాలలలోను, విశ్వ విద్యాలయములలోను గల విద్యార్థుల సంఖ్య650,000 వరకు అభివృద్ధి యగుటకు యేర్పాటు చేయబడెను

1942 సం॥ రానికల్లా నగరాలలోను, కార్మికుల నివాసాలలోను ఉన్నత ప్రాథమిక పాఠశాలలోనికి హాజరయ్యే బిడ్డల సంఖ్య 8600000 నుండి 12,400,000 వరకును దేశంలోని, అంటే గ్రామసీమలలో 20,800,000 నుండి 27,000,000 వరకును అభివృద్ధి యగుటకు అవసరమగు అన్ని యేర్పాటులుచేసిరి. ఈ మూడవ పంచవర్ష ప్రణాళిక ముగియులోగా ప్రాథమిక పాఠశాలలలోను ఉన్నత పాఠశాలలలోను హాజరగు విద్యార్థులు 40,000,000 మంది అగుదురు.

1938 నుండి 1942 వరకు గలకాలంలో సోవియట్ యూనియన్‌లోని పాఠశాలలకు అదనంగా ఉపయోగ పడగలందులకు, నిలువలో ఉండగలందులకు 550,000 నుండి 600,000 మంది ఉపాధ్యాయులను తయారుచేయుటకు కూడ ప్లాను (అంచనాకు, ప్లానుకు తేడా ఉండినందున ప్లానుఅని వాడినాను) వేయబడెను. వేలకువేలు స్థాపింపబడిన ఆధునిక పాఠశాలల సంఖ్యకు వందలు వేలుగ నూతన సుందర భవనములుగల నూతన పాఠశాలలు మిళిత మొనర్పబడుచున్నవి.

రష్యాలోని బహుళంగాఉన్న జాతీయ అల్పసంఖ్యాకులను, జారుప్రభుత్వము తమకుగాను దోపిడీకి ఆధారంగా ఉపయోగించుకొనేది. జారు ప్రభుత్వానికి యీ జాతి ప్రజల విద్యాభివృద్ధి విషయంలో శ్రద్ధయేకాదు, లక్ష్యంకూడా, లేకుండా అతి నీరసంగాచూచేది. అంతేకాదు. ఒకజాతిని మరొకజాతి మీదికి పురికొల్పి సరిహద్దు ప్రాంతాలలోఉన్న ప్రజలలో మూఢత్వాన్ని, రాక్షసత్వాన్ని, ఆటవికతనాన్ని పెంపొందింప జేసిందికూడ.

ఉజబిక్ స్థాన్‌లో, తలకు 25 కోపికు్కలున్ను, టర్కుమెన్ స్థానులో 50పోపికుక్కలున్ను ఖర్చుచేయడాన్ని బట్టి చూస్తే మధ్య ఆసియాలో జారు ప్రభుత్వకాలంలో విద్యకై ఎంత తక్కువ మొత్తాన్ని, ఎంత తక్కువలో ఖర్చు చేసేవారో బోధపడుతుంది.

నేడు టర్కుమన్ స్థాన్, ఉజ్‌బిక్ స్థాన్, ప్రజాసామ్యాలలో ప్రజావిద్యకై తలకు 30 నుండి 40 రూబుల్సు ఖర్చుచేయబడుచున్నది. ఈ ప్రజాస్వామ్యాలలో నేడు నూటికి 80 మందికి పైగా విద్యావంతులుగా నన్నారు. నిర్బంధ విద్యాశాసనం ప్రకారం సోవియట్ రష్యాలోని అన్ని జాతీయ ప్రజాస్వామ్యాలలోని బిడ్డలును ఉచితంగా ప్రాథమిక విద్యను బడయుచున్నారు. 1914 నాటికన్న నేడు 20 రెట్లుగ జాతీయ ప్రజా సామ్యాలలోని బిడ్డలు ఉన్నత విద్యా శాలలకు వెళ్లి విద్యను బడయుచున్నారు. కొన్ని జాతీయ ప్రజాస్వామ్యాలలోఉన్నతవిద్యాశాలలకు వెళ్లి విద్యనుబడసేవారిసంఖ్య యింతకంటే కూడ పెరిగిపోయింది. విప్లవానికి పూర్వం పాఠశాలలకు వెళ్లి విద్యను బడసే విద్యార్థులసంఖ్య కన్న నేడు అజబిక్‌స్థాన్‌లో 53 రెట్లు టర్కోమన్ స్థాన్‌లో 37 రెట్లును, ఉజ్‌బక్ స్థాన్‌లో 58 రెట్లు, ఆర్మేనియాలో 68 రెట్లున్ను విప్లవానికి ముందు 500 మంది విద్యార్థులకన్న మొత్తంమీద లేని కిర్ఘీజియాలో 172 రెట్లును పెరిగిపోయింది. విప్లవానికి

మందు టజకిస్థాన్ లో ఉన్నత పాఠశాల యేలేదు. ఈప్రజాస్వామ్యంలో సోవియట్ ప్రభుత్వం స్థాపించిన పాఠశాలలలో నేడు 22000 మంది విద్యార్థులు విద్యనభ్యసించు చున్నారు.

గ్రామసీమలలోను, నగరాలలోను గల బీదవిద్యార్థులు ఉన్నత విద్యా బోధక పాఠశాలలలో ప్రవేశించకుండా ఉండు టకు ఎన్నో ఆటంకాలు అడ్డంకులు జార ప్రభుత్వం కల్పించింది. సోవియట్ యూని యన్ లోని కళాశాలలలోను విశ్వవిద్యా లయములలోను యువకులు గాని, యువ తులుగాని స్వేచ్ఛగా ఎట్టి అడ్డంకులు లేకుండ ప్రవేశించుటకు విద్యాభివృద్ధిని బడయుటకు అవకాశంకలదు. ఈ అవకా శాన్ని పురస్కరించుకొని ఎందరో విద్యా ర్థులు విద్యనభ్యసించుచున్నారు. జైలో రష్యా-ఇచట విప్లవానికి ముందు విశ్వ విద్యాలయమే లేదు. ఇపుడు 22 ను, అజర్ బైజన్ లో 13 న్ను, ఆర్మేనియాలో 8, ఉజబిక్ స్థానంలో 30, ఉర్కోమన్ స్థానంలో 5, కాజక్ స్థాన్ లో 19, కిర్ ఘీజియాలో 4 ను, విశ్వవిద్యాలయ ములు గలవు. శతాబ్దాలకు పూర్వమే విజ్ఞానానికి ప్రశిద్ధి పొందిన జార్జియాలో విప్లవానికి ముందు ఒక విశ్వవిద్యాలయము మాత్రమే ఉండేది. అందు 300 మంది మాత్రమే విద్యార్థు లుండేవారు. నేడు 18 విశ్వవిద్యాలయాలున్నవి. వీనిలో 21800 మంది విద్యార్థులు విద్య నభ్య సించుచున్నారు. యుక్రేన్ లో, విప్లవానికి ముందు 18 విశ్వవిద్యాలయాలు గలవు. నేడు 139 ఉన్నవి. ఇండియాలోని విశ్వ విద్యాలయాలకు వీటికి తేడాకన్పించు చున్నది. దాదాపు లక్నో, కాశీ, అలిఘర్, అన్నామలై, విశ్వవిద్యాలయా లను పోలినవనవచ్చును.

జాతీయప్రజాస్వామ్యాలు, ప్రాంతాలు తమప్రచురణ సారస్వతాన్ని అభివృద్ధి పరచుకొనినవి. జారుల రష్యా అంతటి లోను 859 వార్తాపత్రికలు ఉండేవి. వీని ప్రచారం 2700000. సోవియట్ రష్యాలో 8550 వార్తాపత్రిక లున్నవి. వీనిప్రచారం 1938 లో 37500000 ప్రతులవరకు ఉంది. ధర్మ గ్రంథాలయాలు 1933-34 లో 43300 ఉండేవి. 1938-39 కి 70000 వరకు పెరిగినవి. వీనిలోని పుస్త కాలు 86,000,000 నుండి 1260,00,000 వరకు పెరిగినవి. ప్రపంచములోనికి గొప్ప గ్రంథాలయం సోవియట్ యూనియన్ లో కలదు. (Moscow లోని జాతీయ గ్రంథాలయం) సోవియట్ యూనియన్ లో 111 జాతీయభాషలలోను నేడు పుస్త కాలు ప్రకటింపబడుచున్నవి. చాల జాతులవారు నేడు మొట్టమొదటగ తమ చరిత్రలో లిపిని కలిగి తమ భాషలో కావలసినంత సారస్వతాన్ని బడయగలుగు చున్నారు.

దేశంలోని విజ్ఞానాభివృద్ధిలో సోవి యట్ ఉపాధ్యాయుడు ప్రధానపాత్ర మగుచున్నాడు. జారుల రష్యాతో పోల్చు కుంటే చాల తక్కువమంది ఉపాధ్యా యులే ఉండేవారు. 1911 లో 92000 మంది ఉపాధ్యాయులే ఉండేవారు. నేడు సోవియటు యూనియనులో దాదాపు 10 లక్షలమంది ఉపాధ్యాయులు గలరు. కేంద్ర సోవియట్ కు (Supreme Soviet) సభ్యులుగ 17 మంది ఉపాధ్యాయులను

ఎన్నుకున్నారంటే సోవియట్ యూనియన్‌లో విద్యాబోధకునకు ప్రజలు ఎంతగా గౌరవం విలువ, యిస్తారో బోధపడగలదు. పదులు, యిరువదులుగ సోవియట్ యూనియన్ యొక్కయు, స్వతంత్ర ప్రజా స్వామ్యముల యొక్కయు, కేంద్ర సోవియట్‌కు, సభ్యులుగ ఉపాధ్యాయులు, ఎన్నుకోబడుచున్నారు. హెచ్చుతగ్గులు లేని భౌతిక సుస్థిరత, సౌష్ఠవము, గల సోషలిజంలోనే బడిపంతులు అనేనీచభావంలేకుండా, విద్యకు విద్యాబోధనకు, ఎంతో గౌరవంయిచ్చి, ఆబోధకుడు గౌరవింపబడుతాడు.

దేశంతోబాటు సోవియటు ఉపాధ్యాయుడును కష్టబహుళమైన ఐతే గౌరవప్రదమైన బాధలను, పోరాటాలను, అనుభవించి, సాగించి, బయటపడినాడు. అంతర్యుద్ధంలో దేశమంతా భీకరపరిస్థితిలో నున్నప్పుడు ప్రథమశ్రేణిలో నిలచిపోరాడినాడు (తరువాత దేశంలోని ధనవంతులు, కులకులు అంటే రైతులు దేశాభివృద్ధికి అడ్డంతేగిలి ఉన్న పాడిపంటలు పశుసంపద అభివృద్ధి నిరోధకంగా నాశనంచేసి దేశానికి ఆర్థికవినాశం దాపురం చేసినప్పుడు సంభవించిన) ఆర్థిక పతనాన్ని యెదిరించి, ఉపాధ్యాయుడు పోరాడి, తనగౌరవాన్ని, దేశగౌరవాన్ని తన శ్రేయస్సును, దేశశ్రేయస్సును, చిరస్థాయిగా నిలిపినాడు. సోవియటుశక్తిలో ఉన్నతస్థానాన్ని బడసి సోవియట్ ప్రభుత్వంచేతను, కమ్యూనిస్టుపార్టీ చేతను, కామ్రేడ్ స్టాలిన్ చేతను ఆదరణ గౌరవాలను బడసి సామ్యవాదభూమిలో, ప్రభుత్వ నిర్వహణలో, ముఖ్య బాధ్యతను నిర్వహించగలిగిన స్థానాన్ని సోవియటులోని ఉపాధ్యాయుడు మాత్రమే పొందగలిగినాడు.

బిడ్డల శ్రేయస్సుకు సంబంధించిన జాగ్రత్త ఒక్క-పాఠశాలలతో మాత్రమే సరిపోదు. శిశువు చిన్నతనపు రోజుల నుండి ప్రారంభమై ఆవ్యక్తి సామ్యవాద సమాజంలో అర్హత సంపాదించిన పౌరుడై లేక పౌరురాలై, మనగలుగుటకు అవసరమైన అన్ని అవకాశాలను కలిగించుటకు పాత్రుడగుతాడు. ఫ్యాక్టరీలలోపనిచేయుచున్న తల్లి, సమిష్టిక్షేత్రంలో పనిచేసేతల్లి తమ బిడ్డలు అనుభవంపొందిన డాక్టర్లు, దాదుల అజమాయిషీలో క్షేమంగాహాయిగా ఉల్లాసంగా ఆనందంగా కిలకిలనవ్వుతూ కేకిరింతలుపెట్టి ఆడుకుంటున్నారని తెలుసుకొన్న మనోవిశ్రాంతితో నిశ్చింతతో ఉన్నప్పుడు ఎంతహాయిగా పనిచేయుచుండును. అది దేశసంపదకాదా?

బాలక్రీడామందిరాలలో పాఠశాలలలో పెరుగుచున్న బిడ్డలకు మానసిక, శారీరక, అభివృద్ధులకు కావలసిన ప్రతిది యివ్వబడును. జనులు చాలా తక్కువగానివసించే మరీ ఉత్తర ప్రాంతలలో, చవిటి ప్రదేశాలలో, అడవిప్రాంతాలలో, బిడ్డలు పాఠశాలలకు ఎంతో దూరమునుండి వచ్చిపోవడంతో కాలంఅంతా వృధాగాకుండా, బిడ్డలకు భోజనశాలలు, పడకలు ఏర్పాటు చేయబడును. అక్కడే ఉంచిన చదువుకుంటూ ఉండవచ్చు. దీనికేమీ ఖర్చు యిచ్చుకోనక్కరలేదు. పాఠశాలకు పోయే యీడుగలబిడ్డలందరు యిందుచేరవచ్చును.

సోవియటు యూనియనులో ప్రభుత్వమును సమాజమున్ను, తల్లిని యెంతో

గౌరవంగాచూస్తారు. దేవతగా పూజించి యితర సమయాలలో బడితపూజ చేసే పద్ధతిగాదు. గౌరవమంటే ఆమె విషయంలో ఆమెలభివృద్ధియే, బిడ్డల అభివృద్ధి యని-బిడ్డల యభివృద్ధియే దేశాభివృద్ధి యని, ప్రపంచాభివృద్ధియని-విజ్ఞానాభి వృద్ధి యని-తల్లి యొక్క మానసిక శారీరక అభివృద్ధులకు కావలసిన అన్ని జాగ్రత్తలు, శ్రద్ధలు, అటుప్రభుత్వం యిటు సమాజం, అతిచురుకుగా తీసుకుంటవి. శిశుజన్మించుటఅంటేప్రతియింట్లోనుఎంతో ఆనందంగా భావిస్తారు.మనమాదిరికుటుంబ భారం కాదుకనుక) ఆతరువాతకూడ ఎంతో ఆనందంగా బిడ్డను తల్లిని గారవిస్తారు.శిశు జననానికి పూర్వమే ఆబిడ్డకు కావలసిన అన్ని సౌకర్యాలు కల్పిస్తారు.శిశు ప్రాయాని కన్న ఆబిడ్డపోషణ,అభివృద్ధుల విషయము ప్రభుత్వము తీసికొనే శ్రద్ధ మూడునెలల ముందుంటుందన్నమాట. సోవియటు యూనియనులో గర్భిణులకు విరామశాలలు, ప్రసూతిశాలలు, శిశుకేంద్రాలు, పాలు వగైరాలు యిచ్చే ఆహారశాలలు, మాతృపోషణశాలలు, శిశుక్రీడా మందిరాలు, అన్నిప్రదేశాలలో ప్రభుత్వంయేర్పాటు చేసి అందరికి అందుబాటులో ఉంచుతుంది.

ఈ పారశాలలోను, శిశుగృహాలలోన, శిశుక్రీడా మందిరాలలోను, శిశువులలో అంతర్గర్భితమై ఉన్న సహజశక్తి సామర్థ్యములను తెలివితేటలను వృద్ధిపొందించుటకు, రాణింపుకు తెచ్చుటకు, నిరంతరం ప్రయత్నించు చున్నందుకు సోవియటు ప్రభుత్వాన్ని ప్రశంసించుట మనవిధి. అందుకు ధన్యవాదాలు పుట్టుకతోనే తెలివితేటలు, శక్తిసామర్థ్యాలు, గల శిశువులవిషయంలో మరింత శ్రద్ధతీసికొనబడును. ప్రత్యేకాదరణ, విద్యాబోధన యివ్వబడును. అనేక నగరాలలో యువకులకు, గాయకులకు, కళాకోవిదులకు, నర్తకులకు, ప్రత్యేకపారశాలలు నిర్మాణము చేయబడి యున్నవి.

సోవియటు ప్రభుత్వం యీవిధంగా శ్రద్ధ తీసికొన్నందున వైజ్ఞానిక హోదా, గణింపలేనంత, ఊహింపలేనంత ఉన్నత స్థాయికి పోయింది. 1937 జనవరికి సోవియటులో మెదడుతో పనిచేసేవారు (Intelligentia)95, 91, 100 మందివరకు పెరిగిపోయింది. సోవియటు యూనియను లోని ఫ్యాక్టరీలలో పనిచేసే మెదడుతో పనిచేసేవారు ఉన్నతవిద్య బడసినవారే అని గుర్తించుకోవలెను. అంటే యీఅంకె యింకా యెన్నోరెట్లు అనుక్షణం అభివృద్ధి యగుచున్నది. మెదడుతో పనిచేసేవారి సంఖ్య వారి కుటుంబాలలోని పిల్లజెల్లతో సహా కలిపితే యీనాడు సోవియటు జనాభాలో 100 కి 13 నుండి 14 వరకు ఉంటారు.

మూడవపంచవర్ష ప్రణాళిక కాలంలో శ్రామికవర్గం యొక్క వైజ్ఞానిక, సాంకేతిక విజ్ఞానం, యింజనీర్ల యొక్కయు, టెక్నిషియనుల యొక్కయు శక్తి సామర్థ్యాలతో తులతూగే స్థితికి రావలెనని సోవియటు ప్రభుత్వం ఆశిస్తుంది. అందరుకార్మికులు, అందరూ కర్షకులు యీసమాజంలో విజ్ఞానం, విద్య కలిగిన సభ్యులుగచేయవలెననెడి కామ్రేడ్ స్టాలిన్ బాధ్యత జయప్రదంగా నిర్వహించబడు చున్నది.

ప్రజలచే ప్రజలకైన ప్రజారాజ్యం అని

అబ్రహాంలింకన్ చెప్పిన ప్రజారాజ్యము నిజంగా ఎక్కడన్నా అక్షరాలా అమలు జరుగుతున్నదంటే, అది ప్రజారాజ్యం అని చెప్పుకోవాలంటే-అది సోవియట్ రష్యాలో ఆప్రజాస్వామ్యాల సమితిలోనే - ఆ సోవియట్ యూనియన్‌లోనే - అమలుజరుగుచున్నవి. అట్టి ప్రజాస్వామ్యం సుస్థిరంగా శాశ్వతంగా ఉండజూచే బాధ్యత ప్రజాస్వామ్యవాదులగు ప్రపంచప్రజలలో ఒకరమగు మనదికూడా-

---




1941 వ సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి

# ప్రాథమిక భూగోళములు

శ్రీ K. వెంకట్రావు B.A., L.T., గారిచే

2 - 3 - 4 - 5 - 6 - 7 - 8 తరగతులకు

వలయువారు:— రామా అండ్ కో.,

ఏలూరు - మద్రాసు - గుంటూరు - రాజమండ్రి.